# పాత్రలు

1. చావో లావో-చుంగ్: బీదరైతు. 55 ఏళ్ళు. రాత్రింబవళ్ళు కష్టపడడంవల్ల ఎండి వరుగయి పోతాడు.
2. చావో టియే-చు: అతని కొడుకు. ఒకటో అంకం ఒకటో రంగం నాటికి ఇరవయిఏళ్ళవాడు. తరువాత తరువాత ఎర్ర సేనలో బటాలియన్ కమాండరు అవుతాడు. పేరు చావో కాంగ్ అని మార్చుకుంటాడు.
3. భార్య: టియే-చు భార్య. ఒకటో అంకం ఒకటోరంగం నాటికి సుమారు ఇరవయి ఏళ్ళు.
4. చావో హెయ్-టాన్: టియే-చు కొడుకు. ఒకటోఅంకం ఒకటోరంగంనాటికి అయిదేళ్ళవాడు. రెండవరంగం నాటికి పీ-టౌ అని పేరు మార్చుకున్నాడు.
5. యాంగ్‌యా-టే: పోతుబరి భూస్వామి. దుర్మార్గుడు. జపాన్ అనుకూలద్రోహిగా మారిపోయి, ఆ తర్వాత కుమింగ్‌టాంగ్ రహస్యశాఖలో పెద్దఉద్యోగి అవుతాడు.
6. యాంగ్‌యావో-సు: అతని కొడుకు. ఒకటోఅంకం ఒకటో రంగంలో ఇరవయియేళ్ళు. తరవాత జపాన్‌కీలుబొమ్మ పోలీసు సేనలో కమాండరయి, ఆతరవాత కుమింగ్‌టాంగ్ రక్షణ సేనకికూడా బటాలియన్ కమాండరు అవుతాడు.

భార్య : చింగ్ మామయ్య కోసరం వెళ్ళారు. పొలందున్ని, గోధుమ జల్లకముందే యెలికమందు సంపాదించి వెయ్యాలనుకుంటున్నారు. వెళ్ళికూడా చాలా సేపు కావచ్చింది.

టియే-చు: (విచారంగా) హుఁ-పొలం దున్నడం! గోధుమ జల్లడం! బాగానేవుంది! యిదుగో డొంకతిరుగు డెందుకూ? సూటిగా చెబుతా విను. దున్నుకోడానికి మనకిచారెడు నేలన్నా లేదు. తెలిసిందా ?

భార్య : అదేవిటి ఖర్మం ! మన మూడెకరాల నేలా చివరికి ఆ యాంగ్ కాజేశాడా యేం? యేడాదినించీ కోర్టులో దెబ్బలాడుతున్నాంగా? ఊహుఁ- యేమైనబ్బా ! నేన్నమ్మను..................

టియే-చు : (కోపంతో) దెబ్బలాడుతున్నాం! దెబ్బలాడి యేం లాంభం, పిచ్చిగాని!

భార్య : యేవిటలా నిప్పులు గక్కుతున్నారు? పదేళ్ళ పయి చిలుకునించీ మన మాపొలం దున్నుకుంటున్నాంగా ? వో కాగితం ముక్క సృష్టించి ఆ యాంగు మనపొలం కాజేద్దామనుకుంటున్నాడూ ? భలే! మామయ్య రేపు పట్నం వెళదామనుకుంటున్నారు. మనం దావా గెలిస్తే..........

టియే-చు : గెలిస్తే! (అమాంతంగా) మనం వోడిపోయాం ! (జేబులోంచి కోర్టు నోటీసు తీసి భార్య మొహాం

దగ్గరగా పెట్టి తీవ్రంగా ఆడిస్తూ) యిదిగో, తీర్పు! మనం ఓడిపోయాం. డబ్బున్న మారాజే గెల్చాడు !

భార్య : (నిర్ఘాంతపోయి) ఊఁ—న్యాయం మన పక్షాన వుంటే ఓడిపోవడ మేమిటి ?

టియే-చు : (కాగితం మడత విప్పి చేత్తో విదిలిస్తూ) కనిపించ డంలా ? దీంతగలెయ్యా యిదిగో కోర్టు ముద్ర. వాళ్ల వంశం ముదనష్టమయిపోను ! వాళ్లని ముక్కలు ముక్కలు కింద నరికిపారేస్తేనేగాని నాకు నిద్రపట్టదు !

(నిశ్శబ్దం. బయటినించి ముసిలివాడిదగ్గు వినిపిస్తుంది)

భార్య : అదుగో, మామయ్య తిరిగొచ్చేశారు. యీ సంగతి ఆయన చెవినింకా పడకుండదు. యిప్పుడిప్పుడే కోలు కుంటున్నారా, యీముక్క వింటే రోగం మళ్ళీ మొదటికొస్తుంది. అంచేత కాస్త నింపాదిగా చెపితే నయం.

(ముసిలి చావోలావో–చుంగ్–వంగిపోయిన నడుం, చెదిరి పోయిన గడ్డం. స్టేజీమీదికివచ్చి హాయి–టాన్‌ని దగ్గిరికి తీసు కుంటాడు.)

టియే-చు భార్య: (మామూలుగా మాట్లాడడానికి యత్నిస్తూ) మామయ్యా! అన్నానికి లెండి.

లావోచుంగ్ : (చేతిలోని చిన్ని పొట్లం కోడలికి యిచ్చి కొంచెం ఆందోళనతో) కొద్దిగా మెలిక మందు దొరి కింది. పొలందున్నేముందు వేద్దాం.(హాయి–టాన్‌తో) అరే బాబూ! దీన్ని నువుముట్టుకోకు. తెలిసిందా?

చిన్నపిల్లలు తినకూడదు యిది మహాచెడ్డ విషం. (కోడలితో) ఆనల్ల జాడీలో పెట్టమ్మా! ఊం- యీ లోకంలో కొంతమందయినా మంచాళ్లుంటారుసుమా! చూడు, నేను తిరిగి రావడానికి చింగ్‌డబ్బులు సాయం చేశాడు. మనం ఆ దావాగెలిస్తే చింగ్‌ని మర్చిపో గూడదు. హుం-అతను సరిగ్గానే చెప్పాడు-మనం దావా వోడిపోగూడదు. వోడిపోయేమాటుంటే తీర్పుయెపుడో చెప్పేసేవాళ్ళే. కేసు పైకోర్టుకెళ్ళి రెండు నెల్ల పైచిలుకయింది. పెద్ద పెద్ద మేస్ట్రీట్లు నిజానికి చాలా జాగర్తగా విచారిస్తారు. న్యాయం మన పక్షాన వున్నంత కాలం.........

టియే-చు: (ఉండబట్టలేక తండ్రి మాటకి అడ్డంవచ్చి) అయితే డబ్బువల్లేం కాదంటావ్? ఉహుం- డబ్బంటే తల్లో జేజెమ్మ దిగొస్తుంది.

చుంగ్ : న్యాయంముందు డబ్బు యెందుకక్కరకు వస్తుందిరా! యీలోకంలో న్యాయం ముందు యేదీ నిలవలేదు. యెక్కడో అక్కడ న్యాయంచెప్పే మేస్ట్రీట్లు వుండక పోరు. (టీ-చు అసలు విషయం వెళ్లకక్కేద్దామను కుంటాడు గాని భార్య వారిస్తుంది)

చుంగ్ : రైతులిలా నానా యాతనలకు గురవుతూండడం చూస్తే న్యాయబుద్ధిగల యేమేస్ట్రీటు కయినా కళ్ళెంట నీళ్లు గిర్రున తిరుగుతాయనుకో. పక్షపాతమంటూలేని మేస్ట్రీట్లు కొందరయినా వుండకపోల్లే!

టిఁయే-చు : (పట్టలేక) ఊఁ-కోర్టు కెక్కడం పట్టి దండుగమారి పని! వాళ్ళ కొంపకి అగ్గెట్టి, వాళ్ళకణ్ణో ఓరుపోసికుండా ఆలంజకొడుకుల్ని కట్టగట్టి ఆమంటల్లోవేసి తగలేస్తే పీడా విరగడయి పోతుంది.

చుంగ్ : మీ కుంచె కారుకి మీ గొడవ మీదే కాని యింకోటి తల కెక్కదు. కాని మనం చట్టాన్ని మీరకూడదు, తెలిసిందా? న్యాయం మనపక్షాన వుంటే అదొక్కటే చాలు. మనకి క్రియదస్తావేదుంది. మనం సాదా రైతులం. మనకి దస్తావేదులే ఆధారం. ఊఁ-దావా గెలవనీ, గెలవకపోనీ ఆ యాంగునిమాత్రం పీకింగు దాకా కోర్టు కీడ్చాల్సిందే.

భార్య : సరే, మామయ్యా! అలాగే గానీ, ముందు అన్నం తిందాంలెండి. చల్లారిపోతోంది.

చుంగ్ : (ఆగకుండా) యిరవై కరుకుడాలర్లు పోసి యీపొలం కొన్నా. యెవరినన్నా సాయంరమ్మన్నానా? ఉహుఁ-యెండనక వాననక వళ్ళణ్ణీ చెమటోడ్చి ఆ నుయ్యి తవ్వాను. తలదాచుకోడానికి కాస్త కొంపేసుకుందామనే ధ్యాసే పోలేదు. ముందునుయ్యి, ఆతరువాతనే యేదన్నా అనుకున్నా. దాంతో పొలానికి నీటివసరు చిక్కింది. యింతలో అసలు ఖామందుచచ్చిపోయాడు. వాడు చావడం సందుదొరికింది. యింకేం, ఆ యాంగు అబద్ధాల క్రియదస్తావేదు సృష్టించాడు. చేతినిండా డబ్బుందిగదూ, నా దగ్గిరినించి యీ పొలం కాస్తా

కొట్టేద్దామని యెత్తులు వేస్తున్నాడు. నేనంత యెర్రి పప్పనేంగాను! (వణికిపోతూ దగ్గుతాడు. టిరయేచు భార్య వెళ్ళి వీపునిముకుతుంది)........... వెధవడబ్బు! వాడిదగ్గిర డబ్బెంత మూలుగుతూంటేమాత్రం నాకేం లెక్క. దావా ఆడితీరతాను. వొరేయాంగ్! నువ్వుకోర్టు పక్షిని. అయితేనేం, దేశంలో న్యాయానికింకా కరువు రాలేదురా! రేపు తయియువాణ్‌ వెళ్ళి........

టిరయేచు: వెళ్ళక్కర్లేదు, నాన్నా!

చుంగ్: యేవిటీ? వెళ్ళక్కర్లేదూ? యెందుకనేం?

భార్య: (భర్త వంక అర్థవంతంగాచూస్తూ) మామయ్యా! మీరింకా సరిగా కోలుకోలేదు. ప్రయాణంచేస్తే మళ్ళా తిరగబెడుతుందేమోనని వారికిభయం. (భర్త కేసి తలూపుతుంది)

చుంగ్: ఆ, నాకేం నిక్షేపంలావున్నా. మననలుగురి బతుకూ యీ ప్రయాణం మీదనే ఆధారపడుంది. ఆ యాంగుని వోడించాలంటే పట్నం వెళ్ళకపోతే యెట్లా చెప్పూ? యేవయినా వెళ్ళితీరాల్సిందే. యిక వెనక్కి తిరగడమంటూ లేదు. (కోడుపుతో) యిదిగో, వెళ్ళి మీచింగ్‌బాబాయిని పిల్చుకురా. కాస్త మాకు సాయపడమని అడుగుతా. మీకుర్రకారు యీచిన్నవయసులో అట్టే కష్టం చెయ్యలేర్లే.

టిరయేచు: నాన్నా! చింగ్‌బాబాయినేం పిల్చుకురావక్కర్లేదు.

భార్య: ఊఁ—వెళ్లొద్దురూ. యేవయినా వెళ్ళి రావడ మేమన్నిద్ది. (టియే—చు తటపటాయిస్తాడు. భార్య పిల్లవాడిని అందించి) పోనీండి, నేనే వెళ్ళొస్తా. మామయ్యని మాత్రం కనిపెట్టుకుండండి. (వెడుతుంది)

చుంగ్: (ఆశాభావంతో) మనం దావా గెలవగానే గోధుమల సంగతి చూడాలి. కోర్టు ఖర్చులకింద యాంగుసునకి యెంతో వొకంత యిచ్చుకోవాలిగదూ! యిక నువ్వు చెప్పు...

టియే—చు: (ఇక ఆపుకోలేక) నాన్నా! కోర్టువారుతీర్పిచ్చారు.

చుంగ్: యేవిటి? యేవిటీ?

టియే—చు: తీర్పిచ్చారు.

చుంగ్: ఆఁ— తీర్పిచ్చారూ? అలాఅయితే యింకేం మనభూమి మనకి దక్కిందన్నమాటే!

టియే—చు: ఊహుఁ—మనం వోడిపోయాం.

చుంగ్: (ఆశ్చర్యంతో)యేవిటీ? వోడిపోయాం? మనం...మనం వోడిపోయాం?

టియే—చు: అవును నాన్నా! వోడిపోయాం భూమి యాంగు పరమయింది. అంతటితో అయిందీ, మనమే వాడికి కోర్టు ఖర్చులిచ్చుకోవాలి. (కాలితో నేలతన్నుతూ) వాళ్లూ, వాళ్ళిల్లు వల్లకాడు గాను! డబ్బుంది, అధి కారం వుంది. యింకేం తమకి అనుకూలంగా తీర్పు రాయించేసుకున్నారు, దుర్మార్గులు!

చుంగ్: (డగ్గు, ఆయాసంతో) నీకెట్లా తెలిసింది?

టియే-చు: పట్నంనించి డిక్రీ నోటీసొచ్చింది. (కాగితం తీసి) చూడు, కోర్టుముద్రకూడా వేసుంది. యాంగుకి పట్నం లో వ్యాపారముంది, సంబంధాలున్నాయి. ఇక లంచం గుమ్మరించాడని స్పష్టంగా తెలిడంలా!

చుంగ్: (వణికే చేతుల్తో కాగితం తీసుకుని తేరిపార జూస్తాడు) అన్యాయం! అన్యాయం! (నిరాశతో) యాంగ్ యు కే మాను పుట్టెడు కష్టాలు తెచ్చి పెట్టావుగదా! యిక బీదవాళ్ళకి దిక్కెక్కడుంది? దిక్కెక్కడుంది?

(దగ్గుతూ ఆయాసపడతాడు)

టియే-చు: నాన్నా! నాన్నా! కాసేపు పడుకుందూ! ఊఁ_ పడుకో నాన్నా!

చుంగ్: (తనలో) నాకిక నిజంగా పుట్టగతులు లేకుండా జేసారా? యీ ముసిలితనంలో చిప్పపుచ్చుకుబయలు దేరాల్సిందే? యిన్నేళ్ళపాటు పడ్డ కష్టమంతా బూడిద పాలేనా? చివరికి చిల్లిగవ్వకి కూడా మొహం వాచి చావల్సిందేనా? ఆరిభగవంతుడా! యిదేనా కోర్టంటే? యిదేనా న్యాయం! యిదేనా చట్టం! బలే న్యాయం! (కాగితం ముక్కలు ముక్కలుగా చించేస్తాడు)

హెయి-టాన్:-తాతయ్యా! తాతయ్యా!

చుంగ్: అబ్బా! అబ్బా!... మీ తాతగుండె బద్దలయి పోయింది, బాబూ! (ఆగి) అబ్బాయి టియే-చు! వెళ్లి కాస్త సారాయి పట్టుకురా నాయనా!

టియే-చు: కాస్సేపు పడుకో నాన్నా! నువింకా బాగా కోలుకో లేదా, సారాయి తాగితే...

చుంగ్: మానాయనవిగా! బాగా కుంగిపోయున్నా. వకచుక్క సారాపడితే మనసు కుదట పడుతుంది. మీా చింగ్ బాబాయి మనకోసరమెంతో శ్రమపడ్డాడు. మనం దావా గెలిచినా గెలవకపోయినా అతగాడికి చెయ్యెత్తి మొక్కాలి. టియే-చు! వెళ్లి సారా పట్టుకురా నాయనా!

టియే-చు: అరసీసాడు చాల్తుందిగా?

చుంగ్: అబ్బే! యేం చాల్తుందిరా, జాస్తీగానేతే. ఊఁ-వక సీసా పట్టుకు రద్దూ. (టియే-చు వెళతాడు)

చుంగ్: (తనలో) ఆరిదేవుడా! నీకు కళ్లులేవూ? ముప్ఫయి ఏళ్లు కష్టించి యీభూమి సంపాదించానే! మేమేందుర్నార్గులమా? కాదే! యిదంతా నాఖర్మ! అబ్బ! యికబతికుండిలాభమేమిటి? చస్తేనే నయం ...చస్తేనే నయం...

హెయి-టాణ: (ఏడుస్తూ) తాతయ్యా! తాతయ్యా! చావద్దు తాతయ్యా!

చుంగ్: సరేలేబాబు! మీాతాత చచ్చిపోడులే. యిదిగో చూడు, ఆకిటికీలో వుందే, ఆ నల్లజాడీ యిలా తీసుకురా బాబూ! నేను...

[హెయి-టాన్ కాంగు ఎక్కి మోకాళ్లపై నిలిచి జాడీ తీసి, తెచ్చి తాతకు ఇస్తాడు. చుంగ్ జాడీలోంచి

బొట్లంతీసి, విప్పి ఎలికమందు మింగేస్తాడు. హేయి-టాఙ్ అమాయకంగా చూస్తుంటాడు]

హేయి-టాఙ్: తాతయ్యా! నాకూ కూస్త పెట్టవే!

చుంగ్: (ప్రేమతో) నువ్విది తినకూడదు బాబూ! (కన్నీళ్లు తుడుచుకుని పిల్లవాణ్ణి దగ్గరికి తీసుకొని ముద్దుపెట్టు కుంటాడు.) బాబూ! మీతాతయ్య యిక వెళ్లి పోతాడు. చూడు, యిట్టే కళ్లుమూసుకుని, కాళ్లునిగడ దన్ని పెట్టి నాఖర్మాన నేను చక్కా-బోతాను. (చుట్టూ చూసి) టియే-చు! యిక నీకు నేనేంచెయ్యలేను, నాయనా!

(టియే-చు భార్య వస్తుంది)

భార్య: చింగ్ మామయ్య యిప్పుడే బయలుదేరివస్తానన్నారు. మామయ్యా! ఆయనేరీ?

చుంగ్: కాస్త సారా తెమ్మని పంపాలే.

భార్య: మామయ్యా! మీరు...?

చుంగ్: యీకాస్త భాగ్యానికి అడ్డుపెట్టకండమ్మా! నేను పూర్తిగా అణగారిపొయ్యా
[టియే-చుభార్య దీపంవెలిగించి బల్లమీాదపెట్టి అన్నం వడ్డిస్తుంది. సారాసీసాతో టియే-చు ప్రవేశిస్తాడు]

భార్య: (మెల్లిగా) మామయ్యతో చెప్పేశారా యేం?

టియే-చు: ఆఁ -

చుంగ్: ఊఁ - యిక మీరిద్దరూ యిలా కూచోండి. కాసేపు అందరం కలిసిమెలిసి ఉందాం. ఊఁ - తినండి. నాలుగు ముక్కలు చెప్తా వినండి.

[టియేచు, అతని భార్యా వినసాగారంభిస్తారు. చుంగ్ గ్లాసులో సారాపోసుకుని తాగుతాడు]

చుంగ్: నాయనా! మీఅమ్మ చిన్నప్పుడే చచ్చిపోయింది. యిక నేను నానాఅవస్థలూ పడుతూ యెలాగో యాభై మూడేళ్లు యీడ్చుకొచ్చా... యిప్పటిదాకా ప్రాణా లెలాగో బిగవట్టా... ఊఁ - చివరికి మిగిలిందిదీ! మిమ్మల్ని అన్యాయం చేశానే అని బాధపడుతున్నా మీకింత ముట్టజెప్పకపోగా, గంపెడు చిక్కులు నెత్తి మీదపెట్టి పోతున్నా. [ఏడుస్తాడు]

టియేచు: నాన్నా! నాన్నా! యేవిటివంతా?

చుంగ్: నాయనా! మీనాన్నిప్పుడు చిల్లిగవ్వయినా చెయ్యడు... కాని యెన్నడూ పరువుతక్కువగా బ్రతకలా. మీరుమాత్రం మీనాన్నపరువుతీసే పనులేం చెయ్యకండేం.

భార్య: మామయ్యా! యిపుడెందుకొచ్చిం దీగోడవంతా?

చుంగ్: భక్తులు పరువు నిలిపినంతకాలమే బుద్ధభగవానుడి బ్రతుకుకూడా. అలాంటపుడు మనిషయినవాడు తనపరువు తనే నిలుపుకోవాలమ్మా! మనం దావాలో వోడిపొయ్యామనుకో. అంతమాత్రాన యాంగ్‌మీద కసిమాత్రం వదిలేయకూడదు.

టియే-చు: అలాగేనాన్నా! అలాగే!

చుంగ్: నేను వెళ్లిపోయాక...

టియే-చు: యేవిటినాన్నా! అలా అంటున్నావ్?

భార్య: యీపూటల్లా చచ్చిపోతా, చచ్చిపోతా నంటూ పట్టించారేవిటి?

చుంగ్: నేను వెళ్లిపోయాక...పగతీర్చుకోడం మర్చిపోకండేం నాయనా! నాకు జరిగిన అన్యాయానికి పగతీరుస్తావని గంపెడాశ పెట్టుకున్నా. యేంజేస్తావో! నా సమాధి దగ్గిర నోట్లకాగితాలు తగలెయ్యకండి. పగ సాధించు నాయనా! పగసాధించు

[కడుపులో విపరీతమయిన బాధపడుతూ, దానిని తెలియనీకుండా చేయాలని యత్నిస్తాడు.]

టియే-చు దంపతులు: యేవిటి? యేవిటి? చెప్పండి.

చుంగ్: అరేనాయనా! అమ్మాయీ? మీరు విచారపడకండి. మీ ముసిలాడికి యీరాత్రి గడవదు.

భార్య: (జాడీ, కాగితంచూసి) మామయ్యా! మీరు... అది తీసుకున్నారా? (భర్తతో) మామయ్య యెలికమందు తినేశారు. తొందర తొందరగావెళ్లి యెవర్నన్నా తీసుకురండి. మామయ్యా!

[టియే-చు భయంతో బయటికి బయలుదేరతాడు. ముసిలి చింగ్ గుమ్మంలో ఎదురుపడతాడు]

టియే-చు: చింగ్‌బాబాయ్! చింగ్‌బాబాయ్!

చింగ్: బాబూ! యేవిటీ గొడవంతా?

భార్య: మామయ్య యెలికమందు తినేశారు.

చింగ్:- ఆఁ- యెలికమందు తిన్నాడూ? తొందర తొందరగా పట్నం పరుగెత్తుకెళ్లి విరుగుడుమందు పట్రా. పో, ఊఁ, పో. అసలు యిదంతా యెందుకొచ్చింది?

చుంగ్: యిదిగో అన్నా! విచారపడకు. నాకు బ్రతికుండాల నేం లేదు. విషం పుచ్చుకున్నా. ఊఁ - వెళ్ళకు నాయనా! వెళ్ళకు. వెళ్లి లాభం లేదు. విరుగుడు మందిక పంజేయదు.

చింగ్: (సారాసీసా చూసి ఆదుర్దాగా) లావో చుంగ్! కొంప దీసి యీ సారాకూడా తాగేశావా యేం?

చుంగ్: (తలాడిస్తూ) ఆఁ-

చింగ్: (నేల తన్నుతూ) సారా యెందుకు తాగనిచ్చారూ? (చింగ్ కాంగు మీదపడి గిలగిలా కొట్టుకుంటూంటే చింగ్ భరించలేదు. బయటికి వెళుతున్న టియే-చుని ఆపి నిరాశతో మెల్లిగా) యీ విషంపుచ్చుకుని, ఆ తరవాత సారాతాగితే యెవరూ యేంచెయ్యలేరు. యిక ముందుపను లేవిటో చూడండి.

టియే-చు: నాన్నా! నాన్నా!
భార్య: మామయ్యా! మామయ్యా! } (ఏడుస్తారు.)

(హాయి-టాన్ భయపడిపోయి ఏడుపు మొదలు పెడతాడు)

చుంగ్: (బాధతో తన్నుకుంటూ) అబ్బా! పేగులు మాడి పోతున్నాయ్! కాసిని మంచినీళ్ళివ్వండిరా. (టియే-చు

భార్య మంచినీళ్ళందివ్వగా తాగుతాడు.) చింగ్ అన్నా! యిలా కూచో.

చింగ్: (కన్నీళ్లు పెట్టుకుని మందలింపుగా) లావోచుంగ్! లావోచుంగ్! యింత తెలివితక్కువ పనిచేశావోయ్! ప్రాణం వున్నంతవరకు ఆశతో వుండాలిగాని, చేతులారా ప్రాణం యెవడయినా తీసుకుంటాడా చెప్పు ?

చుంగ్: చింగ్ అన్నా!

చింగ్: యేం అన్నా ? చెప్పదలచిం దేవిటో యిపుడే చెప్పేసేయ్.

చుంగ్: నాకు అన్యాయం జరిగింది. చచ్చిపోతున్నా. కాని నా పట్టుదలమాత్రం చావదనుకో... యమధర్మరాజు కనిపిస్తే, ఆయనదగ్గిర యాంగుమీద దావా దాఖలు చేస్తా.

[బయటనించి బిగ్గరగా అడుగుల చప్పుడు వినిపిస్తుంది. అంతా ద్వారంవైపు చూస్తారు. యాంగ్‌యుటే తన కొడుకు యాంగ్ యావోచును వెంటబెట్టుకుని ప్రవేశిస్తాడు.]

యాంగ్: ఓ- బలే ఖుషీగా వున్నట్టున్నారే! చావో లావో-చుంగ్, నువ్వు వోడిపోయావ్. వినలా?

చింగ్: యాంగ్‌గారూ! పాపం లావోచుంగ్ చావడానికి సిద్ధంగా వున్నాడు. పాషాణం పుచ్చుకున్నాడు.

యాంగ్: ఒహో! ఆత్మహత్యా! పాషాణం పుచ్చుకున్నాడూ? మంచిపని జేశాడు. లావోచుంగ్! నీ బొందిలో

ప్రాణం వుండగానే నిన్నొకటి అడగదలిచా. యింకా మామీద దావా వేద్దామనే వుందా? చెప్పూ?

యాహో-చు: మా నాన్నగారు అడుగుతున్నారు, చెప్పు. యింకా మాతో వ్యాజ్యమాడాలనే వుందా? ఊఁ- చెప్పు, చెప్పు.

చుంగ్: (కొట్టుకుంటూ) అరేయ్! నే చచ్చిపోయినంత మాత్రాన మనకక్షలు చచ్చిపోవురా. యీలోకంలో నాకు న్యాయం జరగలేదు. అయితేనేం ఆలోకంలో వున్నా నినువిడిచి పెడతాననుకోకు. దావా వేసి తీరతా. దెయ్యాన్నయి నిన్నుపట్టుకుని పీక్కుతింటా. యమభటుల్నిపంపి నిన్ను అరుస్టు చేయించమని ఆయముడికి మొక్కుతా.

యాహో-చు: యేమిట్రా చెత్తవాగుడు! ఊఁ-యిక కట్టిపెట్టు ముసలిపీనుగా!

యాంగ్: లావో-చుంగ్! నీకు దమ్ములుంటే, ఊఁ-కానీ, మళ్ళీ దావా తగిలించు చూద్దాం. మనిద్దరం కలిసే హైకోర్టుకి వెళదాం. ఊఁ- కానీ.

యాహో-చు: యెందుకొచ్చిన గొడవ! దాసోహమ్మను. లేదూ, సుప్రీంకోర్టులో దావావేసిచూడు, తెలుస్తుంది. ఊఁ- పోనీ జనరాలిజమో చియాంగ్-కే-షేకుకే సరాసరి కేసు తీసుకెళ్ళు. మేమూ నీతోబాటే అక్కడికి కూడా వస్తాం. యేమంటావ్? యెలావుంది నాప్లాను?

యాంగ్: లావో-చుంగ్! ముసలితొత్తు కొడకా! కళ్లు బాగా తెరుచుకునిచూడు. నే నెవర్నో తెలుసా? యీ జిల్లా అధికారి పెళ్ళాం మేనమామని! తాలూకా మేస్త్రీటు నాకు దంతపుబల్ల బహుమతీ పంపాడు. యిప్పటి కయినా తెలిసిందా? నువు నామీద యింకా దావా వేద్దామనుకుంటున్నా? యిదిగో చెబుతున్నా, విను. యిప్పుడే, యిక్కడే నీ నెత్తురు పిండేస్తా. యీముక్క చెవి నేసుకుని చస్తే మరీబావుంటుందిగదూ!

చుంగ్: (మూలుగుతూ) నాకు అన్యాయం జరిగింది. న్యాయం కావాలి.

భార్య: (యాంగ్‌తో) ఖూనీకోర్లనయినా వకసారే వురేసేస్తారు. యెందుకాయన్నిలా పొడిచి పొడిచి చంపుతారు? హాయిగా చావనన్నా చావనీయరా యేం?

యాంగ్: వెధవ, కాటికి కాళ్ళుచాచుకున్న ముసిలి వెధవ చస్తా నికి సిద్ధంగా వున్నాడని చెప్పి మమ్మల్ని బెదరగొట్టాలని చూస్తున్నా, ఊఁ- నాదగ్గిర అలాంటిదేం సాగిచావదు. యిలాంటిచావులు లక్షలు నాకళ్ళతో చూచా. సరే, సరే చస్తున్నాడు! ఊఁ- తగినశాస్తి జరిగింది, వెధవకి. అయితేనేం, వాడికుటుంబంలోవాళ్ళు మీరున్నారుగా? యీ అప్పంతా మీరు నెత్తిన వేసుకు తీరాల్సిందే. తెలిసిందా?

టియేం-చు: యిదిగో యాంగ్! తీర్పుమని యెన్నడూభయంపెట్టు కోకు. మానాన్న చస్తే నేనూ, నేను చచ్చిపోయిం

తరవాత నాకొడుకూ తీర్చుకుంటాం. మాకుటుంబంలో మగపురుగంటూ వుండగా తీర్చకుండా వుండంలే.

యాంగ్: సరే. మంచిది. అరే అబ్బాయి! వీడికి యింకా కొన వూపిరి వుండగానే వీళ్లు మనకెంత బాకీపడ్డారో చదివి వినిపించు. ఊఁ— తొందరగా. మీరంతా బాగా వినండి. చింగ్! నువుసాక్ష్యం.

యావో-చు: (అకౌంటుపుస్తకం పేజీలుతిప్పుతూ) కోర్టువారు యేమని డిక్రీ యిచ్చారంటే— నువు అక్రమంగా ఆక్రమించుకున్న మూడు యెకరాల అరవయితొమ్మిదిసెంట్ల నూతికింద మాగాణిభూమి తిరిగిచ్చివేయాలి...

చుంగ్: (వణికిపోతూ) ఆరిభగవంతుడా!

భార్య: మామయ్యా! (యాంగ్ కేసి తిరిగి) మీకుదండంపెడతా బాబూ! మీరు....

టియే-చు: వీళ్ళకి దండం పెట్టటమేవిటి? ఉహుఁ— యేమాత్రం వీల్లేదు.

యావో-చు:(చదువుకుపోతాడు).... అంతేకాః కోర్టు ఖర్చుల కింద, ప్రయాణపు ఖర్చులకింద 326 రూపాయలున్ను, పరువునష్టంకింద 200 రూపాయలున్ను వెరశి 525 రూపాయలు చెల్లించుకోవాలి.

చుంగ్: (లేవాలని తంటాలుపడుతూ) నాయనా! పగతీర్చుకో. (బాధతో కిందపడిపోతాడు)

టియే-చు: (అమాంతంగా) నాన్నా! (ఏడుస్తాడు)

భార్య: (అదేసమయంలో) మామయ్యా! (ఏడుస్తుంది)

హాయి-టాన్: (ఏడుస్తూ) తాతయ్యా!

చింగ్: (నిట్టూర్చి) అబ్బ!

(టియే-చు ఎగిరిపడి, కన్నీళ్లు గుడ్లల్లో కుక్కుకుంటూ యాంగ్ వంక తేరి పారజూచి, మెల్లిగా తలుపు దగ్గిరికి జారుకుని బయటికి వెళ్ళిపోతాడు)

చింగ్: యాంగ్ గారూ! భూమి మీకిపుడు దఖలుపడింది. కాని డబ్బు.... నిజానికి...యీకుటుంబంకేసి చూడండి. యీ ముసలాడిని మన్నచేయడానికే వీళ్ళచేతిలో చిల్లిగవ్వయినాలేదు. పూర్తిగా అణగారిపొయ్యారు. సీకింకేం యిచ్చుకోగలరు?

యాంగ్: వోరి నీమొహం తగలడా! పో. అవతలకిపో, నీమనసంత కరిగిపోతే వాళ్ళకి బదులు నువిచ్చుకోరాదూ?

చింగ్: యేమిటి? నేనిచ్చుకునేదా?....బలే! నాకేంవుండేడిసింది మీకు తెలియందేవుంది!

హూవో-చు: నాన్నా: యికచాలిద్దామా?

యాంగ్: ఊహుం- యీవ్యవహారమింకా అప్పుడే యేమయింది? యిపుడే తండ్రిచచ్చిపోతే తానూ, తను చచ్చిపోతే తనకొడుకూ తీర్చుకుంటామని టియే-చు చెప్పాడు, వినలా? బాకీ అణాపైసల్తో సహా తీరేవరకూ యీ వ్యవహారం సాగుతూండాల్సిందే.

చింగ్: మీగడ్డం పట్టుకుంటా. కాస్త దయుంచి వీళ్ళకో దోవ చూపించండి....

యాఙో-చు: (శవంకేసి తలూపుతూ) అదిగో, అదీదోవ! జన రాలిజమో చియాంగ్-కే-షేక్, జనరల్ యెన్ షి-షాన్ యేవని చెప్పారో తెలుసా? ప్రజలు అణిగిమణిగి పడుండాలన్నారు. వారలా పడున్నంత వరకు.... (హఠాత్తుగా బయటినించి గోల వినిపిస్తుంది. భగభగ మండుతున్న అగ్నిజ్వాలలు కిటికీమీద ప్రతిఫలిస్తాయి)

యాంగ్: యేవిటి? బయట యేంజరుగుతోందేం? యింతగోల పుట్టింది?

యాఙో-చు: (చూడడానికి బయటికివెళ్ళి) నాన్నా! చూడు, చూడు. మనయిల్లు తగలడిపోతోంది.

యాంగ్: (కంగారుగా) యెవడాలంజాకొడుకు, వాణ్ణితగలెయ్య!

యాఙో-చు: ఊఁ- వాళ్ళని పారిపోనీకండి. యెవరా నిప్పంటించిన గాడ్దికొడుకు? (యాంగ్, యాఙో-చు తొందర తొందరగా వెళ్ళిపోతారు)

భార్య: (శవందగ్గిరికి వెళ్ళి) మామయ్యా! యాంగుయిల్లు కాలి చక్కా బోతోంది. యిక మీరు నిశ్చింతగా కను మూయచ్చు. (మంటలవంక చూస్తూ) ఊఁ-భగభగా, భగభగా మండిపోండి! యెంతభగభగామండిపోతే అంత మంచిది! వాళ్ళిల్లు బూడిద బూడిద చేసెయ్యండి!

చింగ్: యాంగు యెంత ఛండాలప్పని చెయ్యాలో అంత ఛండాలప్పనీ చేశాడు. వెధవకి బెడిసికొట్టింది. తగిన శాస్తి అయిందిలే (టియే-చు భార్యతో) వెళ్ళి, యిరుగు

పొరుగువాళ్ళని పిల్చుకొస్తా. తతిమ్మా విషయాలు యెలాతగలడ్డా యీాయన్ని సక్రమంగా మన్ను చేద్దాం.

భార్య: చింగ్ మామయ్యా!...

చింగ్: వ్యవహారం యింతదాకా వచ్చింతరువాత యీా వూళ్లో యింకా మీారుండడం మంచిదికాదమ్మా! మీామామని మన్ను చేసింతరవాత బాగా ఆలోచించుకొని యిక్కడి నించి వెళ్లిపోండి. మీా కొక్కరేకాదు, యీా వూరు వూరంతా యాంగ్ కాలికిందపడినుగ్గునుగ్గయిపోతోంది. నేను మీాకు పెద్దగా సాయం చెయ్యలేనుగాని, నారోజు కోసం జాగ్రత పెట్టుకున్న పెట్టివుంది. అదిచ్చేస్తాను. యీా ముసిలాడికి అక్కరకొస్తుంది...

భార్య: చింగ్మామయ్యా! మీా సాయం యెన్నటికీ మర్చిపోలేం (చింగ్ వెళ్లిపోతాడు. టియేచు రొప్పుతూ లోపలికి పరుగుచ్చుకు వస్తాడు)

టియేచు: (రొప్పుతూనే) నా కోటూ, చెప్పులూ యిలా పారెయ్. ఊఁ— తొందరగా.

భార్య: (హడలిపోయి) యేవిటిసంగతి? యెక్కడికెళ్లొచ్చారు?.

టియేచు: యెక్కడికెళ్లొచ్చానా? వాడికొంపకి అగ్గెట్టొచ్చా. తెలిసిందా? ఊఁ—తొందరగా ఆవిలా పారెయ్.

భార్య: [అమిత ఆశ్చర్యంతో] మీారా—మీారా వాడింటికి అగ్గెట్టింది?...

టియేచు: అవును. నేనే. వాళ్ళందర్నీ కట్టగట్టి ఆ మంటల్లో పారేస్తే పీడావదిలేది!

భార్య: (విచారంగా) మీరుకూడా... మీకు బతికుండాలని లేదా యేం?

టియే-చు: నేను తప్పించుకుని పారిపోతాను. తొందరగా ఆ కోటిలా పడెయ్.

భార్య: (విచారంతో కోటు అందిస్తూ) అయితే ఎక్కడి కెడతారు?

టియే-చు: యిక్కడి కేవిటి? బోలెడంత ప్రపంచముంది... బొగ్గుగనుల్లో చేరతా. లేదూ వ్యవసాయ కూలీగా పనిచేస్తా. అదీకాదు, పటాలంలో చేరిపోతా. ఆ వెధపల్ని హతమారుస్తేనేగాని తిరిగిరావడం పడదు.

భార్య: (దుఃఖంతో) మీరు... మమ్మల్నిద్దర్నీ వదిలిపెట్టి వెళ్ళిపోతారా! యిక మాగతేం గాను?

టియే-చు: నే నింటిదగ్గరే గనక వుండిపోతే పీకమీదికి వస్తుంది. అబ్బ! (తండ్రి శవంవంక చూసి) నాన్న పొలం మళ్ళీ గుంజుకోవాలి! పగ తీర్చుకోవాలి!

భార్య: అలాగయితే సరే, వెళ్ళండి. (ఆగి) దీంతో మన సంసారం ముక్కలు చెక్కలయిపోతోంది.

(నిట్టూరుస్తుంది)

టియే-చు: [వ్యాకులయినట్లు] నువు మాయింట్లో అడుగుపెట్టి ఆరేళ్ళయింది. వకనాడన్నా సుఖపడలేదు. ఆయాంగు మూలకంగా మనబ్రతుకు బండలయిపోయింది. మనకి వేరే దిక్కెక్కడేడ్చింది చెప్పూ? [ప్రియాత్న

పూర్వకంగా] యిదిగో... నాన్నని సక్రమంగా మన్ను చేసి...నువ్వు మారుమనువు కట్టుకో.

భార్య: ఛా, అవేం మాటలు! నిన్ను చేసుకున్నాను. మీ కుటుంబంలో వకదాన్నయ్యాను. నువ్వు తిరిగిరావడానికి పదేళ్లు పట్టినా, యిరవైయేళ్లు పట్టినా నీ కోసమే కాసుకుని వుంటా. నీకు మామీద నిజంగా ప్రేమంటూ వుంటే మమ్మల్ని మరిచిపోవద్దు. అంతే.

టియే-చు: నా గొంతులో వూపిరున్నంతవరకు నిన్ను మర్చిపోను. తప్పకుండా తిరిగి వస్తా.

భార్య: నీకోసం కాసుకునివుంటా. ముసలైతేయినా కుర్రాణ్ణి సాకుతా. వాడు పెద్దవాడయాక... [కుంగిపోయి] యిక మళ్లీ వకర్నొకరం చూసుకోమా యేవిటి ఖర్మం!

టియే-చు: ఊహుం- మళ్లీ తప్పకుండా కలుసుకుంటాం. బెంగ పెట్టుకోకు. ఆరోజు వచ్చితీరుతుంది... కాని నేను తిరిగిరానే అనుకో, అప్పుడు మనబాబు భారమంతా నెత్తినేసుకుని మన పగవాళ్లమీద పగ తీర్చుకోవాలి. [కొడుకుని ఎత్తుకుని ముద్దాడి] బాబూ! వెళ్లిపోతున్నారా!

హెయి-టాన్: వద్దు నాన్నా! వెళ్లొద్దు.

టియే-చు: మీారిక యీవూళ్లో బ్రతకలేరు. యాంగు మనల్ని వేటాడకుంటా వూరుకోడు. అందుకని యిక్కడినించి చక్కాబోండి. బాబుకి పేరుమార్చి కొత్తపేరు పెట్టి యాంగ్ కంట బడకుండా కాలక్షేపం చెయ్యండి.

భార్య: సరే. అలానే చేస్తాగాని మీరు తొందరగా వెళ్ళిపొండి.

టీయేచు: [బయలు దేరబోయి మళ్ళీ వెనక్కి తిరిగి తండ్రి శవంముందు మోకరిల్లి] నాన్నా! నాన్నా! నీకు చావు తెచ్చిపెట్టిన వాళ్ళమీద పగతీర్చుకోడానికి ఈ టీయేచు వెళ్ళిపోతున్నాడు. నిన్ను నాచేత్తో మన్ను చేసేందుకు నేను నోచుకోలేదు, నాన్నా! [నమస్కరించి, లేచి తిరిగి చూడకుండా చక్కాబోతాడు]

హేయి-టాన్: నాన్నా! నాన్నా!

భార్య: [నెమ్మదిగా] బాబూ! బాబూ! మన కష్టాలు తీర్చడానికి మీనాన్న వెళ్లారు. [దుఃఖం అపుకోలేక బిగ్గరంగా నిట్టూర్చి మళ్లీ తమాయించుకొని] బాబూ! మనిద్దరం యేదోవిధంగా కాలం వెళ్ళబుచ్చుదాం. నువ్వు పెరిగి పెద్దవాడవయితే మనకష్టాలు తీరతాయిబాబూ!

[దీపాలు క్రమక్రమంగా ఆరిపోతాయి]

# ఒకటో అంకం

## రెండో రంగం

"జగత్తులో ఏమూలా జాగాలేకుంటేనేం
అరుణసేనలో నాకొక అర్థస్థానం ఉన్నది.
ఇక్కడ నన్నుఁ సేవారెవ్వరు లేకుంటేనేం
కేలుజాపి తల్లిలాగ లాలిస్తుందెర్రసేన"

(పదేళ్ళు గడిచాయి. ఉత్తరచీనాలో షాన్సీ రాష్ట్రంలోని తయియువాన్ దగ్గర ఒక చిన్నపట్టణం. ఆకురాలు కాలం. ఒకపూరి గుడిసెలోపలి భాగం. గదిలో ఒక ఇనపపొయ్యి, చినిగిపోయిన పాతచాప, చినిగిపోయిన దిండు, కొన్నిబట్టలు, జాడీలు ఉంటాయి. గుడిసెపైకప్పు బాగా కిందికుంటుంది. గదిలో చీకటి, తేమ, గోడపైన ఎక్కడో కిటికీకి బదులు చిన్న రంధ్రముంది. ఆ రంధ్రంగుండా సూర్యకిరణాలు గదిలో పడుతూంటాయి. స్టేజీమీద క్రమంగా దీపాలకాంతి ప్రసరిస్తుంది.

సూర్యకాంతిలో కూర్చుని ఒక స్త్రీ చినిగినబట్టలు కుడుతూంది. ఆమె చినిగిపోయిన దుస్తులు ధరించింది. మొహం బక్కచిక్కి పాలిపోయివుంది. కళ్ళచుట్టూ నల్లటి చారలు ఏర్పడ్డాయి. కాని జుట్టు, చేష్టలనుబట్టి ఆమె టీచరు భార్య అని గుర్తించవచ్చు.

నేపథ్యంలో తుపాకీ కాల్పులు. సాంగ్ పిన్హ్ తొందరరగా ప్రవేశిస్తుంది. ఆమె మనిషిని, దయార్ద్రహృదయ)

సాంగ్: (మెల్లిగా) ఆ కుక్కల కొడుకులు మళ్ళీ అరెస్టులు సాగించారు. అప్పుడే పదిమందిని లాక్కు చక్కా బోయారు. వెధవలు! ముసిలవాన్ కొడుకుసి- మెర్, కెంగ్జే కొడుకుని పట్టుకుపోయ్యారు. మొర్రసిపాయిల కోసం వెతుకుతున్నామని చెబుతున్నారు. తొత్తుకొడుకులు! హుం- వాళ్ళు మనబోటి సాదారకాన్ని లంకించుకు పోతున్నారు.

భార్య: (అతిమెల్లిగా) యెర్రసేన మళ్ళీ దిగిందా యేం?

సాంగ్: (రహస్యంగా) ఆఁ-దిగిందనే విన్నా. చాలామంది దిగారుట(గుమ్మంలోకివెళ్ళి తొంగిచూసి ఎవరూవినడం లేదని ధృవపరుచ్చుకుని) జపాన్ వాళ్ళ పని అయిపోయిందట! యిక తోకముడవాల్సిందే! వాళ్ళతో కుమ్మక్కయిన మన వెధవాయలు వూరుకుంటారా? యెన్ని దుర్మార్గప్పనులు చెయ్యాలో అన్నీ చేస్తారు. అయితేనేం, యివాళ కాకపోతే రేపు అంతకంతా అనుభవించి తీరతార్లే. (చేతిలోని బట్టలు టేబిలుమీ భార్యకిచ్చి) యివిగోనమ్మా!

భార్య: యేవిటివి?

సాంగ్: (నవ్వుతూ) నీకింకా పనిపట్టుకొచ్చా. వీటిరంపుతికి చిరుగులు కుట్టిపెట్టు. వచ్చే డబ్బులు వకపూట తిండికి వచ్చినా వచ్చినట్టే- (డబ్బులు యిస్తూ) యెక్-నియు

యివి నీ కిమ్మన్నాడు. అతనికి బొంతకుట్టి పెట్టావుగా అందుకూ యివి. తక్కువేననుకో.........

భార్య: తక్కువేం కాదులే, పిన్నీ! కాకపోయినా, పాపం! అతనూ దరిద్రంతో అవస్థపడుతున్నాడుగా!

సాంగ్: (పొయ్యిమీద గిన్నె మూతతీసిచూసి) పీ-టీ తిరిగి వచ్చాక మాపొలంవెళ్ళి వో సొరకాయ, యిన్ని గోరు చిక్కుడు కాయలూ కోసుకురమ్మను. కానే వున్నాక నాలుగు పెండలం దుంపలు తెచ్చిస్తాలే. యేవిటీపిండి! యిది మనుష్యులుతినే పిండేనా? యింత కంటె గంజినీళ్ళునయం.

భార్య: (విచారంగా నవ్వుతూ) యీ రోజుల్లో ఆ గంజినీళ్ళ కూడా కరువువాచినవాళ్ళు వేలకువేలున్నారుపిన్నీ! మనకిదయినా దొరుకుతోంది సంతోషించాలిగాని నణుక్కోవడ మేవిటి? మా మామ గారు చచ్చి పోయ్యాక, నన్ను, అయిదేళ్ళ పసిగుడ్డుని ఆ దొర వూళ్ళోనించి వెళ్ళగొట్టేశాడు. యింటింటికీతిరిగి ముష్టెత్తుకున్నాం. వకపూటతింటే, వకపూటపస్తు! యిప్పటిదాకా యెన్ని తిప్పలుపడ్డామో భగవంతుడి కెరిక.

సాంగ్: (సానుభూతితో) అవునవును. నాకంతా తెలుసులే అమ్మా! యీ పదేళ్ళు......పదేళ్ళయిందికదూ?

భార్య: (మనసులో లెక్క వేసుకుంటూ) బాబుకి అప్పుడు అయిదేళ్ళు. యిప్పుడు పదిహేనేళ్ళు...... అవును పిన్నీ ! సరిగ్గా పదేళ్ళు.

సాంగ్: (అర్థం చేసుకున్నట్టు) అబ్బ ! పదేళ్ళు! నువ్వు ఆడ కూతురివి, అయిదేళ్ళ పసాడితో, చేతిలో గవ్వయినా లేకుండా, తలదాచుకోడానికి నీడయినా లేకుండా కాలం యీడ్చుకు వచ్చావంటే, పాపం, యెన్ని కష్టాలు పడ్డావో ?

భార్య: మా అదురుష్టంకొద్దీ నువ్వు తటస్థపడ్డావు. మా కెంతో వుపకారం చేస్తున్నావు, పిన్నీ! లేకపోతే మాగతి యే మయ్యేదో! యిప్పుడు తలదాచుకోడానికి మాకో చూరు యేర్పడింది చలికాలంలో బిగుసుకు పోకుండా యింత చలిమంట వేసుకోగలుగుతున్నాం. చాలీ చాలని తిండయినా ముంతెడు అంబలిదొరుకు తోంది. అంతేచాలు. తిండికిబిప్పలికీ మాకింత సాయం చేస్తున్నావా, రక్తబంధువుకంటెకూడా నువ్వు మాకు దగ్గిరదానివయి పోయావు, పిన్నీ ! నీ రుణం యెలా తీర్చుకోవాలో తెలీడంలేదు.

సాంగ్: యిప్పుడాగొడవంతా యెందుకులే, "మేస్ట్రిట్లు మేస్ట్రిట్లు వకటే. ప్రజలూ ప్రజలూ ఒకటే. పేదాళ్ళకి పేదాళ్ళే సాయం చేస్తారు." ప్రతివాడికీ యెప్పుడో వకప్పుడు యితర్లతో అవసరం పడుతూనే వుంటుంది.

భార్య: పోనీ నువింతవున్నదానివయితే అనుకోవచ్చు. అలాం
టపుడు మాకు సాయంచేస్తూంటే ఆ ముక్క అన
కుండా యెలా వుండగలను?

సాంగ్: (చిరునవ్వుతో) మాకింత కొంద్రవుంది. యేదో
నీకంటె కాస్త మెరుగ్గానే వున్నామనుకో. యిలాంటి
రోజుల్లో నీది, నాది అని భేదంపెట్టుకుంటే యెలా
చెప్పు? నలుగురు కలిసి కట్టుగా తిప్పలుపడాల్సిందే.
యీ జపాన్ పిశాచాల్ని తరిమేసినాక, పీ-టీ యింత
సంపాదించిపెడుతూంటే హాయిగా తింటూ కూర్చున్న
రోజున...ఆరోజున యింతసాయంచేద్దుగానిలే.

భార్య: (నిరాశగా నవ్వుతూ) ఆరోజుకోసరం యెంత తహ
తహలాడి పోతున్నానో నీకేంతెలుసు పిన్నీ! ...
యిన్నాళ్ళూ వకటేచింత, వకటేచింత! మా కష్టాలు
యెపుడు తీరుతయ్యో కదా!

సాంగ్: నిరాశ చేసుకోకమ్మా! కష్టాలు కలకాలముండవు
(చెవిలో) టూ గ్రామంలోనికోటను యెర్రసిపాయిలు
పట్టుకుని అక్కడి సర్కారు కచేరీని నేలమట్టంచేశా
రట. ఈ సంగతి నేను చెప్పానని యెవరితోనూ అన
బోకమ్మా, (వెళ్ళిపోబోతూ) పీ-టా యేదీ?

భార్య: కోతల్లో యెవరికో సాయంవెళ్ళాడు. వచ్చే వేళ
యింది.

సాంగ్: తిరిగొచ్చినాక మాపొలం వెళ్ళి తింటాని కింత తెమ్మని చెప్పడం మర్చేబోకేం: (వెళ్ళబోతుంది)

భార్య: ఆఁ- అలాగే పిన్నీ! వక్కనిమిషంఆగు, నీ కో మాట చెప్పాలి.

సాంగ్: (తిరిగికూర్చుని) నీ మనసులో వున్నదేవిటో మీ పిన్నితో చెప్పేసెయ్యమ్మా! సందేహించకు. మీ పిన్ని తంటాలు పడగలిగినంతవరకు...

భార్య: నువ్విప్పుడు చెప్పావే, అదే, అదినిజమేనా, పిన్నీ!

సాంగ్: యేవిటది?

భార్య: అదే 'మైత్రసేన దిగింది, జపాన్‌వాళ్ళిక తోకముడ వాల్సిందే' అన్నావే అదే.

సాంగ్: (మెల్లిగా) అదా? మా మేనల్లుడు చెప్పాడు. నిజ మనే తోస్తోంది. (వివరంగా చెప్పదలచినట్లు) వాడు వాళ్ళతో కలసి పనిచేస్తున్నాడు. (వేళ్ళతో ఎనిమిదో దళాన్ని సూచిస్తూ ఎనిమిది అంకె వేస్తుంది)

భార్య: (సంతృప్తి చెందింది. తటపటాయిస్తూ) పిన్నీ! రాత్రి నాకోక కలొచ్చింది. ఆ కల్లో వాళ్ళనాన్న తిరిగొచ్చి నట్టు కనిపించింది. మైత్రసేనలో చేరారట! నడుముకో పట్కా, చేతుల్లో తుపాకీ! నాదయింట్లో కాలుపెట్టీ పెట్టగానే, 'బాబూ! నాతోరా, ఆ కోటను తగల

బెట్టేద్దాం' అన్నారు. ఆపట్న యిద్దరూ చకా-బోయి
కోట తగలబెట్టేశారట ! మంటలు ఆకాశమెత్తున
లేచాయి. ఆకాశం యెర్రబారి వెలిగిపోయింది... నాకు
మెలుకువ వచ్చింది. మళ్ళీనిద్రపడితేనట్టు! పొద్దుటినించీ
ఆ కలే నా మనసులో మెలుగుతోంది. దాన్ని
గురించి ఆలోచించకూడదని యెంతనుకున్నా మానలేక
పోతున్నా, (విచారంగానవ్వి) కల నిజం కాకూడదా,
వాళ్ళనాన్న నిజంగా తిరిగి రాకూడదా అనుకుంటా.

సాంగ్: (సానుభూతితో) వకక్క-పుడు కలలునిజమవుతూంటా
యమ్మా! పీ-టా నాన్న సరిహద్దుప్రాంతాల్లో కని
పించాడన్నారుగా!

భార్య: యేమోనమ్మా, పిన్నీ! కొంతమందేమో, వారు
బొగ్గుగనుల్లో చచ్చిపోయాడంటున్నారు, మరికొంత
మంది యెర్రపటాలంలో వకనాయకుడు అచ్చంగా
వారిలాగా వున్నాడంటున్నారు. యేదినిజమో, యేది
అబద్ధమో తేలడంలేదు. పదేళ్ళయి పోయింది. వక్క-
ముక్క-యినా......

సాంగ్: అయిందీ, కాంది వూరికే వూహించుకుని మనసు
చెదరగొట్టుకోకమ్మా! నువ్వీవూరొచ్చి అయిదేళ్ళు
కావచ్చింది, నీ అచూకీ తెలియుండే యేంజేస్తాడు
చెప్పు ?

భార్య: అవును పిన్నీ ... పదేళ్ళయిపోయింది. వారు మళ్ళీ
తిరిగొస్తారని నిజంగా నీకు నమ్మకముందా పిన్నీ!

సాంగ్: (ఓదార్పుగా) తప్పకుండా తిరిగొస్తాడమ్మా! తొందరలోనే జపాన్ వాళ్ళని నాశనంచేసి మొగ్రసేన సరాసరి యిక్కడికే వచ్చిపడుతుంది.

భార్య: పిన్నీ! యిదంతా నా ఖర్మ కాకపోతే యేమిటి చెప్పు? ఊహుఁ- లాభంలేదు.

సాంగ్: నీకేవన్నా పిచ్చా! ఖర్మేమిటి? ఖర్మ! ఖర్మంటే వకప్పుడు నాకూ పిచ్చినమ్మకముండేది. మొన్నీ మధ్య, మా మేనల్లుడున్నాడే వాడు, ఆ పిచ్చికాస్తా వదిలించేశాడు. వాడన్నాడు: "పగవాళ్ళ చేతుల్లో వడ్డ మీ ప్రాంతంలో భూస్వాములు, ప్రజాద్రోహులు నానాటికీ భాగ్యవంతులయి కూర్చుంటున్నారు. ఇక రైతులో నానాటికీ దిగజారిపోతున్నారు కాని పగవాళ్ళ చేతుల్లోంచి బయటపడ్డ సరిహద్దు ప్రాంతాల్లో భూస్వాములకి ప్రజలని తిప్పలు పెడతానికి గుండెల్లేకుండా పోయ్యాయి. అక్కడ రైతుల బతుకు నానాటికీ బాగుపడుతోంది. సరిహద్దు ప్రాంతాల్లోని దరిద్రులకి పట్టనిఖర్మ, యిక్కడ మనకు పట్టిందా? పట్టిది!" దానిమీద బాగా ఆలోచించా. వాడిమాటే నిజమని తోచింది. యిక్కడ దరిద్రులమంతా నికృష్టపు బతుకు బతకాలని రాసిపెట్టుందంటే దానికేవన్నా అర్థమూ పర్థమూ వుందా చెప్పు? అక్కడ, ఆ సరిహద్దు ప్రాంతాల్లో యెవరికీ ఖర్మతో నమ్మకంలేదట. అందరికీ మావో లోనే నమ్మకముందిట.

భార్య: మావో!

సాంగ్: (రహస్యంగా) యిందులో వక్కముక్కన్నా బయటికి పొక్కనీయకూడదమ్మా! కోటలో యిది తెలిసిందంటే, అమ్మో యింకేమన్నావుందా !... యిక నే వెళతానమ్మా! పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోకేం? (సాంగ్ పిన్ని వెళ్ళిపోతుంది. టియే-చు భార్య కాస్సేపు శూన్యంలోకి తేరిపారజూస్తూ నిల్చుంటుంది. అన్నం వెచ్చచేయడానికి పొయ్యి వెలిగిస్తుంది. ఇంతలో షీ-టా చకాకా వస్తాడు. చినిగిపీలికలయిన దుస్తులు వేసుకున్నాడు. నుదుటిమీదనించి రక్తం ధారకడుతోంది)

భార్య: రా, బాబూ! రా, అన్నం తిందువుగాని. (చూసి హఠాత్తుగా భయంతో బిగ్గరగా) అరే! యేం జేసొచ్చావ్? నెత్తిమీద ఆ నెత్తురేవిటి? (అంటూ చింపిపీలికలతో తలకు కట్టు కడుతోంది.) యెవరితో కొట్లాడావేం, యింతదెబ్బ తగిలింది? ఆ గొప్పోళ్ళ బిడ్డలజోలికి పోకురా, కలో గంజో తాగియిలా పడుండామని యెన్నిసార్లు చెప్పానుగాను! వాళ్ళకేసి కన్నెత్తి చూస్తేనే చాలు, కష్టాలు వెంటబడతాయి. నేచెబితే విన్నావూ? అబ్బ! యెంత పెద్దగాయమో!

షీ-టా: నా తప్పేం లేదమ్మా! యిక్కడితొత్తులు నన్ను కోటకు లాక్కెళ్ళి చావగొట్టారు......

భార్య: నిన్నెందుకు లాక్కెళ్ళారురా?

షీ-టా: యెర్రసేన తరఫున పనిచేస్తున్నానని నాచేత వొప్పించాలనితంటాలుపడ్డారు. ఇద్దరుయెర్రసిపాయిలుతప్పించుకుపోవడానికి నేను సాయంచేశానంటున్నారు. వెధవలు!

నేనలాంటి పనేంచెయ్యలేదని చెప్పానమ్మా! నమ్మండే. వాళ్లు నా చేతులు మెలితిప్పేశారు! లాఠీలతో చావ మోదారు. నా పీక కి తుపాకీసున్నిమొన ఆనించి హడలగొట్టి నాచేత చెప్పించాలని చూచారు. నేను "నన్ను చంపినా సరే, యెగ్రసేన సంగతి నాకేం తెలీదు." అన్నాను. కొత్తగా వచ్చాడే, ఆ ఆఫీసరు: "మొండాణ్ణి, నీళ్ళు నన్నేం జేయగలరు అనుకుంటు న్నావా? ఆఁ – లంజకొడకా! చూడేం జేస్తానో!" అన్నాడు. దానిమీద సున్నితో వకవేధవ నా నెత్తి మీద పొడిచాడే.

(బాధ పడుతున్న ముఖం పెడతాడు)

భార్య: (ఏడుస్తూ కొడుకుని కావలించుకుని) అబ్బ! యిదేం బ్రతుకు? వూపిరి పీల్చుకోడానిక్కూడా మనకి హక్కు లేదా యేం? మనప్రాణాలు వాళ్ళగుప్పిళ్లలో వున్నాయ్. యెప్పుడు తలుచుకుంటే అప్పుడు లాక్కుపోతారు. చంపేయాలనుకుంటే చంపేస్తారు... (ఆగి) యిక్కడి తొత్తులకి కోపంవచ్చే పనేంజేశావ్?

షీ–టా: నేనేం చెయ్యలేదమ్మా! బాడవవెంట వెడుతున్నా, అంతే.

భార్య: అక్కడికి యెందుకు వెళ్ళావ్? (షీ–టా మాట్లాడడు) ఊఁ– చెప్పు బాబూ, చెప్పు. (తలుపు దగ్గరికి వెళ్లి బయట ఎవరూ లేరని ధృఢపర్చుకుని) బాబూ! నిజం చెప్పు. నిజంచెబితే కోప్పడన్లే.

పీ-టా: (మొదట తటపటాయించి తర్వాత జరిగిందంతా చెప్పేద్దామనినిశ్చయించుకుని) అవమ్మా! యిద్దరు యెర్ర సిపాయీలకి దోవ చూపించాను...

భార్య: (చకితయై) నువ్వా? నిజంగానే?...

పీ-టా: అవునమ్మా! యెర్రసేన యెప్పుడు వస్తుందా అని నువ్వు యెదురు చూస్తున్నావుగా! వాళ్లిద్దరూ యెర్రసేన తాలూకు వేగులవాళ్లు. యెర్రసేన వచ్చి కోటపట్టుకో డానికి ముందు యిక్కడ కూపీతీయడానికి వచ్చారు.

భార్య: (కుమారుని వీపు ప్రేమతో నిమురుతూ) అందుకని నిన్ను చావగొట్టారూ? సున్నితో పొడిచారు? ఊఁ- యింత బాధపెట్టినా నువేమీ చెప్పలేదన్నమాట!

పీ-టా: చెబితే యింకేవన్నా వుందా? నన్ను హతమార్చేసే వాళ్లు. అందుకని మహాఁ గొడవజేసి యేడ్చేశాను. అంతే ననుకున్నా, నినుగూడా చిక్కుల్లో పెట్టిన వాడవుతానని వక కథ అల్లిచెప్పాను. వాళ్ళతో నాది టింగ్ గ్రామమనీ, చూసిపోవడానికి యీవూరు వచ్చా ననీ, నాపేరు వాంగ్-యెన్‌సియావో అనీ, యెర్రసేన సంగతీ, పచ్చసేన సంగతీ నాకేం తెలీదనీ అన్నాను, దాంతో నన్ను వాళ్లు వదిలిపెట్టేశారు.

భార్య: (అమ్మయ్య అన్నట్లు నిట్టూర్చి) బలే మంచివాడివి! అసలు సంగతంతా చెప్పు. యెర్రసిపాయీలని యెలా కలుసుకున్నావ్?

సీ-పా: మధ్యాహ్నం కూటికిలేచాం. నేను కోనేట్లో నీళ్ళు పోసుకుందామని వెళ్ళాను. అప్పుడు యిద్దరు మనుష్యులు చక్కావచ్చి 'కోట యెక్కడుందీ? అందులో యెంద రున్నారు? యెన్ని తుపాకీలున్నాయి? అక్కడి వాళ్ళల్లో జపాను వాళ్ళెందరు? యిక్కడితొత్తులెందరు?' అని ప్రశ్నమీద ప్రశ్న వేశారు. చివరికి వూళ్ళోకి దోవ చూపించమన్నారు. మీ రెవరని అడిగా. 'మేం యెర్ర సేన తాలూకు మనుష్యులం. యిక్కడికి వచ్చి కోటను తుడిచిపెట్టేద్దామనుకుంటున్నాం. మేం రావడం మీ కిష్టమేనా?' అని వాళ్ళల్లో వకడు అడిగాడు. నేనన్నాను, "మీ రెప్పుడు వస్తారా, యెప్పుడు వస్తారా అని యెదురు చూస్తున్నాం. దారి చూపిస్తా రాండి, రాండి" అని చెప్పి చెప్పులేసుకుని బాడవకి అడ్డంపడి వాళ్ళని తీసుకుపోయా. మళ్ళీ తిరిగొచ్చేటప్పుడు యిక్కడి కీలుబొమ్మ సిపాయిలు కొంతమంది నాకు దారిలో తగిలారు. 'యీ వైపున యెవరన్నా యిద్దరు మనుష్యులు కనిపించారా?' అని అడిగారు. 'ఆఁ — కనిపించారు. యిటు దక్షిణంగా వెళ్ళారు. అట్టేసేపు కాలేదు.' అని చెప్పా. వాళ్ళు సైకిళ్ళమీద ఆ మనుష్యుల్ని పట్టుకోడానికి పరిగెత్తారు. కాని వాళ్ళు వీళ్ళకి దొరికితేనా? తిరిగొచ్చి నన్ను పట్టుకు చక్కా పోయారు.

భార్య: అయితే ఆ యెర్రసిపాయిలిద్దరూ, యిక్కడ యీ వూళ్ళోన్నే వున్నారన్నమాట!

పీ-టా: (ఆవేశంతో) ఆc- వున్నారమ్మా! వున్నారు. జపాన్ వాళ్ల రోజులు దగ్గిరపడ్డాయని యెర్రసిపాయీలు చెప్పారమ్మా! యెర్రసేనలో పదిలక్షల మందున్నారట. యిక్కడి కోటలో యెంతమంది తొత్తులున్నా వుఫ్న వూదేస్తారట. కోటను నేలమట్టం చెయ్యగానే, ఆ సొట్టకపుమచ్చల లంజాకొడుకు పీక పిసిగేస్తా.

భార్య: ఆ సొట్టకపు మచ్చలమొహం వాడెవడురా?

పీ-టా: కొత్తగారాలా, ఆ ఆఫీసరు. యిక్కడి కీలుబొమ్మ పటాలానికి నాయకుడు. సున్నితో నను పొడిపించిందా వెధవే నమ్మా!

భార్య: నలుగుర్లోనూ యిలా మాటాడావంటే కొంప మునుగుతుంది. జాగర్త బాబూ!

పీ-టా: హుc- యెర్రసిపాయీలు యింకా యేవన్నారో తెలుసా? యీ జపానాళ్ల పెద్దన్నయ్య హిట్లరుపనీ, చిన్నన్నయ్య ముసోలినీ పనీమట్టమయిందిట. యిక యీ జపానోళ్లొక్కళ్లే మిగిలారు. యెర్రసేన పోట్లాడుతున్న కొలదీ బలపడుతూ ముందుకు తోసుకుపోయి స్థావరా లేర్పరచుకుంటోంది. యిక మనపట్నం వక్కటే దిగడింది. అమ్మా! విన్నటూ గ్రామంలోని కోట పట్టుకున్నారు. నీ చెవిని పడలా?

భార్య: బాబూ! యెర్రసేన తొందరగా వస్తే బావుండును. మనరోజులు బాగుపడతాయ్.

పీ-టా: అమ్మా!... నేనూ వెళ్ళి యెర్రసేనలో జేరిపోతానే.

భార్య: యేవిటా పిచ్చిమాటలు! కాస్సేపు పడుకో. కాస్త గంజి వెచ్చబెట్టిస్తా.

షీ-టా: (హఠాత్తుగా యేదో జ్ఞాపకంవచ్చి) అమ్మా! మా నాన్న పేరు టియేన్-చు కాదటే?

భార్య: (హఠాత్తుగా ప్రశ్నించేసరికి ఉలిక్కిపడి) ఆఁ- అవును. కాని యీసంగతి యెవరితో నన్నా అనేవు సుమా! అసలీ విషయం యిపుడెందు కొచ్చిందీ?

షీ-టా: మరేంలేదు, ఆ స్ఫోటకపుమచ్చల యాంగ్ అడిగాడులే!

భార్య: స్ఫోటకపుమచ్చల యాంగా? అతనెట్లావుంటాడేం ?

షీ-టా: యాంగా? పొడూగ్గా, మహాపచ్చగా వుంటాడు. మీసాలు పోగ్గావుంటాయి. రెండు బంగారపు పళ్లు. వాళ్ళనాన్న తయియూవాన్‌లో తోత్తుల కమిటీకి అధ్యక్షుడు. అమ్మా! యేవిటలా వున్నావ్?

భార్య: (తెల్లబోయి) హుఁ- (తనలో) వాళ్ళపీడ యింకెన్నటికీ వదలిపోదాయేం?

షీ-టా: (తోచక) అమ్మా! యేవిటిదంతా? వాడెవడేం?

భార్య: నిన్న వాడే మడిగాడో పూసగుచ్చినట్టు చెప్పుబాబూ!

షీ-టా: కొంచెంసేపు నాకేసి తేరిపాఱజూచాడు. తరవాత, 'లంజకొడకా! టియేన్-చు నీకేమవుతాడు?' అని అడిగాడు.

భార్య: దానికి నువ్వేమన్నావ్?

షీ-టా: నేనా? నేనన్నాను 'టియేన్-చు? ఆఁ- టియేన్-చు మా టింగ్ గ్రామంలోని భూఖామందు కొడుకు. నన్నెప్పుడూ

కొడుతూంటాడు.' దాంతో ప్రశ్నలు వేయడం మానేశాడు.

(భార్య నిట్టూరుస్తుంది)

పీ-టా: అమ్మా! ఆ సొప్పటకపుమచ్చల యాంగుని నువెరుగు న్నావా యేవిటి?

భార్య: ఆ-వాడు మనకి బద్ధశత్రువు బాబూ! యీయాంగూ, వాడి తండ్రీ కలిసి నడి చలికాలంలో మనల్ని వూళ్లో నించి తరిమేశారు. చేతిలో చిల్లిగవ్వయినా లేదు. ఆ చలిలో నిను బుజానవేసుకుని వణుకుతూ వూళ్ల మ్మట ముష్టెత్తుకుంటూ తిరిగాను. వకనాడూ కడుపు నిండా తినేరగం. తరవాత తరవాత కోటల్లో పనిదొరి కింది. ఆపనీ యీపనీ చేస్తూ యెలాగో కాలం దొర్లిం చాను. చివరికి యేలాగయితేనేం యీబస్తీ చేరుకు న్నాం. యాంగ్ మనల్ని కనిపెడతాడనే భయంకొద్దీ నీ పేరుమార్చి పీ-టా అని చెబుతూవచ్చాను. యిక వాళ్ళకంట పడంకదా అనుకున్నా. కాని మళ్ళీ వాళ్ళ గుప్పిట్లో చిక్కుకుంటామని యెవరు కలగన్నారు?... వాళ్ళ మూలంగానే మీ నాన్న యిల్లు విడిచి పారిపో వల్సివచ్చింది. పదేళ్లయింది, జాడేలేదు. (కన్నీళ్ళు తుడుచుకుంటుంది).

పీ-టా: యేడవకమ్మా! యేడవకు. కసి తీర్చుకుంటాలే. నిను జాగర్తగా చూస్తుంటాగా. యేడవకిమ్మా!

భార్య: బాబూ! మన పీకలమీదికి కత్తి వచ్చిపడింది. నాకు నువు తప్పితే యింక దిక్కెవరున్నారు చెప్పూ? యీ నిముషంనించీ మాటల్లో, చేతల్లో మహా జాగర్తగా వుండాలి సుమా! నీ కేదయినా కీడు మూడిందంటే నేనింకెవరి కోసరం బతికుండాలి చెప్పూ?

పీ-టొ: అమ్మా!...అమ్మా! యెర్రసేనలో దేశం నాలుగు మూలలనించీ జనం వచ్చిచేరారని ఆ యెర్రసిపాయిలు చెప్పారు. మానాన్న యెర్రసేనలో వున్నాడేమో యెవరికి తెలుసు?

భార్య: అంత అదురుష్టంకూడానా బాబూ! యిక ముందు యెవరన్నా మీనాన్న సంగతి అడిగితే బొగ్గుగనుల్లో పనిచేస్తూ చచ్చిపోయాడని చెప్పు. తెలిసిందా?

పీ-టొ: ఆఁ- అలాగేనమ్మా!

(సాంగ్‌పిన్ని వస్తుంది)

సాంగ్: అమ్మాయ్! అమ్మాయ్! (పీ-టొని చూసి) అరె! బాబు! అదేవిటి?

భార్య: కాళ్ళకుచుట్టుకున్న పాము కరవక మానుతుందా పిన్నీ! ఆ కోటలోని తొత్తులు వీణ్ణి పట్టుకుని, యెర్రసిపాయిలు తప్పించుకు పోవడానికి సాయపడ్డావని చెప్పి చావగొట్టారు. సున్నితో నెత్తిమీద పొడిచారు. చూడు, పిన్నీ! ఆఁ అదేవిటీ? రా, యిలావచ్చి కూర్చుని సంగతేవిటో చెప్పు?

సాంగ్: (రహస్యంగా) కోటలో వుండే కీలుబొమ్మ సిపాయీలు యింటింటికీ సోదాచేస్తానికి వస్తున్నారు. వూళ్ళో మిత్రసిపాయిలు దాక్కున్నారట! అందుకని సక యిల్లూ వదిలిపెట్టకుండా సోదా చేస్తామని బెదిరిస్తున్నారు. చాంగ్‌లావో-హెన్ యింటో మూలమూలా గాలించేశారు. వాళ్ళకి అనుమానం కలిగించే వేవన్నా యిక్కడుంటే దాచేయమ్మా!

భార్య: పిన్నీ! పీ-టా యిక్కడుండడం మంచిదేనంటా? మళ్ళీ వాళ్ల కంటబడితే చావమోదకుండా వుంటారూ ?

సాంగ్: వాళ్ళ కంటబడకుండా వుండటమే మంచిది. ఎందుకయినా ముందు జాగర్త పట్టం నయం. రా, బాబూ! మనిద్దరం దొడ్డిదోవనెల్లి కాస్సేపు దాక్కుందాం పద.

పీ-టా: నాకేం ఖర్మమొచ్చింది. దాక్కోడానికి? వాళ్లంటే నాకేం భయం!

భార్య: బాబూ! పిన్ని చెప్పినట్టు విని, వెళ్ళిదాక్కో.
[సాంగ్‌పిన్ని పీ-టాని వెంటబెట్టుకుని వెడుతుంది. దూరాన్నుంచి ఏడుపులు, పెడబొబ్బలు వినిపిస్తాయి]

భార్య: (తనలో) యిదేం బ్రతుకురా, భగవంతుడా! (పొయ్యి వెలిగించడానికి వెడుతుంది. దగ్గిరగా అడుగులచప్పుడు. కీలుబొమ్మ సిపాయీలిద్దరు ప్రవేశించి నలువంకలా పరికిస్తారు)

1వ కీ. సి: యీ యిల్లెవరిది?

భార్య: చావోది.

1వ కీ. సి: నువ్వొక్క దానివేనా, యింకెవరన్నా వుంటు న్నారా?

భార్య: వకర్తినే వుంటున్నా. యింకెవరూ లేరు.

1వ కీ. సి: భుక్తి యెలా గడుస్తోంది?

భార్య: బట్టలు వుతుకుతాను. కుడతాను. యిలాంటివే యేవో చిన్న చిన్నపనులు చేసుకుని పొట్ట పోసుకుంటున్నా.

2వ కీ. సి: (సోదా చేసి కనిపించిన బట్టలు చూపుతూ) మగాళ్ల బట్టలు యిక్కడి కెలావచ్చాయ్? చెప్పు? ఊఁ— యెర్రసిపాయీలని దాచిపెట్టావా? నిజంచెప్పు.

1వ కీ. సి: (రెండవ వానితో) ఆమె చెప్పింది సరిగా వినిపించలా? వాళ్ళబట్టలూ, వాళ్ళబట్టలూ వుతికి పొట్ట పోసుకుంటున్నానని చెప్పెగా. యింకేం?

(రెండవసిపాయి బట్టలు విసిరిపారేసి మొదటివానికేసి చురచురా చూస్తాడు)

1వ కీ. సి: యేమిటి మహాఁ గొడవజేస్తున్నావ్? మనం మనం చీనావాళ్ళంకదూ' (పదమని సైగజేసి గుమ్మంలోకి వెళ్లి) సాబ్! యీ యింటో వక్కతే ఆడకూతురుంది. బట్టలు వుతుకుతూ, కుడుతూ పొట్టపోసుకుంటోంది. మంచిదాని లాగానే వుంది సాబ్!

గొంతు: ఊఁ— అప్పుడే యిల్లు నాలుగుమూలలా సరిగా సోదా చేశారట్రా, దొంగవెధవల్లారా! యేదో తొందర తొందరగా ముగించు చక్కాబోదామనా, తప్పొడు ముండాకొడుకుల్లారా! (అంటూ యాంగ్ యావో-చు

ప్రవేశిస్తాడు. చాలాకాలం క్రితమే దేశద్రోహిగా మారిపోయాడు. జపాన్ సైనిక దుస్తులు ధరించాడు. నడుముకు కత్తి. చేతిలోని కొరడాను ఝళిపిస్తాడు. మనిషిలో పెద్ద మార్పేమీ లేదు. షోగ్గా మీసం పెంచాడు. అంతే. పూర్వకంటె తలబిరుసుదనం హెచ్చింది. సిగరెట్టు వెలిగించుకోడానికి గుమ్మంలో ఆగుతాడు. అగ్గిపుల్ల వెలుగులో అతని ముఖం కనిపిస్తుంది. చియే-టు భార్య హడలిపోయి గిర్రున తిరిగి పొయ్యి వెలిగించడంలో నిమగ్నమవుతుంది)

యావో: యిలాంటి అలకాజనం విషయంలో మనం మరీ జాగర్తగా వ్యవహరించాలి. యీ రోజుల్లో దరిద్రమ్మొండా వాళ్లందరికీ మనసు ల్లో యెర్రసేనంటే అభిమాన మేడుస్తోంది. వీళ్ళని యేమాత్రం నమ్మకూడదు. (టియే-చు భార్యకేసి తిరిగి) యీ యింటో యింకెవరూ లేరూ?

భార్య: లేరుబాబూ! నే నొక్క దాన్నే వుంటున్నా.

యావో: (హఠాత్తుగా) యెర్రసిపాయిల్ని దాచిపెట్టావుగదూ? ఊఁ- చెప్పు. నిజం చెబితే బతికిపోతావ్. చెప్పు.

భార్య: యెర్రసిపాయీల సంగతి మాకేం తెలుస్తుంది బాబూ! నిజం. నాకేం తెలీదు.

యావో: (జిజ్ఞాసతో) హుఁ- తెలీదేం? నీకేం తెలియకపోతే మొహం చాటేసుకున్నా వేం? నువ్వేం పడుచుపిల్లవా యేమన్నా నా! మొహంచూపించడానికి భయమెందుకే?

(అధికార స్వరంతో) యేదీ, నీ మొహంచూడనీ. (బిగ్గరగా) ఊఁ– యిటు తిరుగు. యేదీ నాకేసిచూడు. ఊఁ–.

భార్య: (యిక గత్యంతరం లేదని నిర్లక్ష్యంగా తలెత్తి యావో కేసి చూస్తుంది. ఆమెకళ్ళల్లో ద్వేషం రగుల్తూంటుంది)

యావో: (గుర్తుపట్టి చకితుడయి) ఒహో, నువా... అందుకా మొహాం చాటేసుకున్నావ్!... నిను గుర్తుపడతానని భయమేసిందికదూ? హహహా! మొహం చాటేసుకుంటే మాత్రమేం, నిను గుర్తుపట్టాలే. (సగర్వంగా తిరుగుతూ పశువులా యికలిస్తూ) నీ మొగుడు బావున్నాడా? బాగా గడుస్తోందా? మస్తుగా సంపాదించాడనుకుంటా. నిను చూటానికయినా యెన్నడూ వచ్చినట్టు లేదే? ఊఁ– యిదిగో వాడికి, 'చిన్నదొర యిపుడు జపాన్ సామ్రాజ్య సేనలో కంపెనీ కమాండరు. వారికి మూడు మేడలున్నాయి. మళ్లీ వచ్చి వాటికి యెప్పుడు అగ్గిముట్టిస్తావా అని యెదురు చూస్తున్నారు', అని కబురు చెయ్యి. తెలిసిందా?

భార్య: (ఓర్పుతో) కబురుచేసి లాభమేవిట? వారు చాలా కాలంక్రితమే... చచ్చిపోయ్యారు.

యావో: చచ్చిపోయాడూ? హహహా! బలే! మంచిది. జరగవలసినట్టు గానే జరిగింది. వాడు యెర్రసేనలో వున్నాడని పుకారు బయల్దేరిందిలే! అదంతా అబద్ధమన్నమాట! ఊఁ–

(యీ వార్తవిని టియే-చు భార్య సంతోషించి, నిట్లా
రుస్తుంది.)

యాంవో: అయితే, నీకో కొడుకుండాలి గదా? యీ పాటికి
వాడికి పదిహేను, పదహారేళ్లుండాలే!

భార్య: నా కొడుకూ చాలాకాలం కితమే చచ్చిపోయ్యాడు.

యాంవో: (క్రౌర్యంతో) అబద్ధాలాడుతున్నావటే, లంజా!

భార్య: (స్వరంలో ద్వేషంతో బిగ్గరగా) నా కొడుకుని పొట్ట
పెట్టుకుంది మీరే... ఆ వూళ్లో వుండనిచ్చారా,
పెట్టారా? చలి వణికించేస్తుంటే వూళ్లోనించి వెళ్ళ
గొట్టారు. నాబిడ్డ వక పాడుబడ్డ గుడిలో చలికి
బిగుసుకుపోయి చచ్చూరుకున్నాడు.

యాంవో: ఊఁ— అంటే మా కుటుంబం కుటుంబం తుడిచి
పెట్టుకు పోయిందన్నమాట!

భార్య: ఊహుఁ— యింకా నేనొకదాన్ని బతుకున్నా.

యాంవో: యీ కథ విన్నయితే నమ్మేవాణ్ణేసుమా! కాని
యీవాళ పగలు యేంజరిగిందో తెలుసా... యీ
కళ్ళతో నీకొడుకుని చూసా. ఆ లంజాకొడుక్కి
తియ్య తియ్యగా మాటాడడం బాగా తెలుసు. టింగ్
గ్రామంనించివచ్చాను, నాపేరు వాంగ్ అన్నాడు
వెధవ! తెలివితక్కువ మొద్దుని వాడి మాటలునమ్మి
వదిలి పెట్టేశాను. (కోపంతో) ఊఁ— యిక నిజమేవిటో
చెప్పూ. నీ కొడుకెక్కడున్నాడు? వాణ్ణి మర్యాదగా

అప్పగిస్తావా అప్పగించు, లేదా నిన్ను వేటకుక్కలకి వేస్తాను. తెలిసిందా?

భార్య: అప్పగించనా? తయియవాన్ వెళ్ళి నల్లకాట్లో వెతుకు కనిపిస్తాడు.

యావో: వెధవముండ! అరేయ్, యిలారా, ఆతుపాకీ దీనిమీద తిరగెయ్యి.

[రెండో కీలుబొమ్మ సిపాయి ముందుకు రాబోతుంటే, మొదటి సిపాయి వాణ్ణి వెనక్కితోసి తానే స్వయంగా తుపాకి తిరగేసి టియేచు భార్యను కొడతాడు.)

యావో: చెప్పు. ఊఁ చెప్పు. యేం, యింకా గట్టిగా వుత కరా. యెదీ యిట్టా యియ్. (తుపాకీ లాక్కొని వూపి టియేచు భార్యని కిందపడేటట్టు కొడతాడు) ఊఁ చెప్పు.

భార్య: (లేస్తూ) చచ్చిపోయాడు.

యావో: (మళ్ళీకొట్టి) ఊఁ యికచెప్పు, నిజంచెప్పు.

భార్య: చచ్చిపోయాడు, చచ్చిపోయాడు.

యావో: (మళ్ళీ కొడతానికి కొరడా ఎత్తుతాడు. ఆమె పళ్ళు పటపటా కొరుకుతుంది. ఇంతలో సాంగ్‌పిన్ని చకచకా వస్తుంది.)

సాంగ్: కమాండరుగారూ! ఆమెని క్షమించండి. మంచిముండ! మీకాళ్ళకి మొక్కుతా...

యావో: (కొరడాదించి) యిది నీకేమవుతుందే?

సాంగ్: అబ్బె! యేఁకాదు. యిరుగుపొరుగు వాళ్ళం బాబూ!

యావో: (సాంగ్‌తో) యీ కుటుంబంలో యింకా యెవరెవ రున్నారు? నిజంచెప్పు. చెప్పకపొయ్యావో నిన్ను కుక్కలకి వేస్తా.

సాంగ్: అలాగేబాబూ! అలాగే. నేనూ, మా ముసిలాయనా యిద్దరమే వున్నాం. ఆయన అవిటాయన.

యావో: మీ కుటుంబంసంగతి యెవరిక్కావాలే. దీని కుటుంబం సంగతి అడుగుతున్నా, చెప్పు.

సాంగ్: దీని కుటుంబమా? దీనికి కుటుంబ మెక్కడేడ్చింది? వక్కతే, యింకెవ్వరూలేరు.

యావో: నువు నిజమేచెబుతున్నావో, అబద్ధమే చెబుతు న్నావో నాకెట్లా నమ్మకం?

సాంగ్: కుక్కలకి వేస్తానన్నాక యింకా అబద్ధంచెప్పడమే!

[తెరలోనించి తుపాకీకాల్పులు వినిపిస్తాయి]

2వ కీ. సి: (భయంతో) కాల్పులు! కాల్పులు! యెర్రసేన వచ్చిపడింది!

యావో: యెర్రసేన! యెర్రసేన! పిరికివెధవా! నీ నెత్తురు కళ్ళ జూస్తా.

1వ కీ. సి: భయమెందుకురా? యెర్రసేనకి యిక్కడికి వచ్చే గుండెలెక్కడున్నాయిరా? ఉహుఁ—

యావో: రారనేమిట్లే! వస్తేరానీ, పోరాడదాం. జపాన్‌వాళ్ళ పనయిపోయిందని మనం భయపడాల్సిన పన్లేదు. జన రాలిజమో చియాంగ్-కే-షేగ్ మన కందరికీ

వృద్ధోగాలిచ్చాడు. మనం యిప్పుడు కొమింటాంగ్ సిపాయిలం. కొమింటాంగ్ పటాలం మహాబలమయింది. తెలుసా? భయమెందుకు? వావెంటరండి. (టియేంచు భార్యతో) నీ పున్నెం పుచ్చింది. లంజా! యిప్పటికి వదలిపెడుతాన్నాలే. (యిద్దరు సిపాయిలతో యాంగ్ వెళ్ళిపోతాడు. మళ్ళీ తెరలో కాల్పులు ప్రారంభమవుతాయి. సాంగ్ పిన్ని గుమ్మంలోకివెళ్లి వాళ్లు వెళ్ళిపోయారని నిశ్చయించుకుని తిరిగివచ్చి టియేంచు భార్యని లేవదీస్తుంది)

భార్య: పిన్నీ! పిన్నీ! (గట్టిగా ఏడుస్తుంది)

సాంగ్: పాపం! యెన్ని కష్టాలు వచ్చిపడ్డాయమ్మా నీకు! (సానుభూతిగా తనకళ్లు తుడుచుకుంటుంది)

భార్య: మనలోకం యింతచిన్నదేం పిన్నీ! వీడు మావంశం వంశమే తుడిచిపెట్టెయ్యాలని చూస్తున్నాడు.

సాంగ్: పీ-టా యింక యిక్కడుండడం క్షేమం కాదనుకుంటా. యెక్కడికన్నా వెళ్ళిపోయి వీళ్ళకంటబడకుండా వుంటం మంచిది. యెఱ్ఱసేన యీ వెధవలకి తగిన శాస్తి చేసిం తర్వాత తిరిగి రావచ్చునులే.

భార్య: నిన్ను విడిచిబెట్టి నేను బతకలేను పిన్నీ! కాని, కాని వేరే దోవలేదు. పదేళ్లనించీ వీళ్ళ కంటపడకుండా దాటుకొచ్చాం. కాని యేం లాంభం! వీళ్ల గుప్పిట్లో నించి తప్పించుకోలేకపొయ్యాం. సరే, మనసు రాయి చేసుకున్నా. వాడు యీ చుట్టుపక్కల వున్నంత

వరకు మాకు కష్టాలు తప్పవు. వాళ్ళో మేమో తేలి
పోవాల్సిందే! బాబుని యెర్రసేనలో చేరడానికి పంపిం
చేస్తా.

సాంగ్: అదే సరయిన పనమ్మా! పంపించకపోతే యెలాగో
వకలాగ బాబుని పట్టుకుపోతారు. అప్పుడు బాబుపని
మరీ అధ్వాన్నమవుతుంది. మన కళ్ళముందు యెంత
మంది పడుచువాళ్ళని లాక్కుపోయ్యారో, చూడు?
కాస్త గుండెలున్నవాడల్లా యెర్రసేనలో చేరిపోతు
న్నాడు.

[పీ-టా గబగబా లోపలికి చక్కావస్తాడు]

పీ-టా: అమ్మా! అమ్మా! (ఏడుస్తూ) వినుకొట్టారా, వెధవలు!
వాడి వంశం తగలబడిపోను! (కొంచెం ఆగి) అమ్మా!
వెళ్ళి కమ్యూనిస్టుల్తో కలసిపోతా, యెర్రసేనలో కలసి
పోతా. పగసాధిస్తా.

భార్య: యేడవకురా బాబూ! వెళ్ళు, వెళ్లి వాళ్ళల్లో కలసిపో.
యీ యాంగుగాళ్ళని తుడిచిపెట్టి మరీ తిరిగిరా.

సాంగ్: వెళ్ల దలుచుకుంటే చీకటుండగానే తొందరగా వెళ్లడం
మంచిది. కువాంతా గుడివెనగ్గా వెళ్ళి రెల్లుదుబ్బుల్లోంచి
వుడాయించు, టూగ్రామంలో యెర్రసేనతాలూకు
మనుష్యులున్నార్లే.

భార్య: (పీ-టాకి కోటు తొడుగుతూ) యెర్రసేనలో వుంటూ
మంచిగా నడుచుకో. పైవాళ్లు చెప్పినట్లుచెయ్యి. యీ
ద్రోహుల్ని హతమార్చి, మరీరా.

షీ-టా: అలాగే నమ్మా!

భార్య: యేడవకు బాబూ! యేడవకు. యిల్లు వదిలి వెళ్లి పోతున్నావా: నువ్వు మగాడిలా మెలగాలిగదూ! వెళ్ళి మగాడిలా మెలగడం నేర్చుకుని పగతీర్చుకో. నీ తండ్రికీ, తాతకీ వాళ్లు పట్టించిన గతే నువ్వు వాళ్ళకి పట్టించు. తెలిసిందా, బాబూ?

షీ-టా: అలాగేనమ్మా! యీ ముక్కలు యెన్నడూ మర్చి బోను.

భార్య: ప్రాణం వున్నంతవరకు యెదో విధంగా తంటాలు పడుతూ నీ కోసరం యెదురుచూస్తుంటా. మన కుటుంబంలో కల్లా నువొక్కడివే మగపిల్లాడివి. మీ నాన్న యీ లోకంలోవించి వెళ్ళిపోయిన మాట నిజమే అయితే అంతా నీమీదే ఆధారపడి వుంటుంది.

షీ-టా: అవునమ్మా! దీన్నిగురించి చింతపెట్టు కోకు! అమ్మమ్మా!అమ్మకి గుండెనిబ్బరంతక్కువ. జాగర్తగా చూస్తూవుంటావుగదూ?

నాంగ్: మానాయనగదే! నువ్వేమీ సంకోచం పెట్టుకోకు. మా దగ్గిర యేకాస్త వున్నా మీ, అమ్మకేం కొదువ రానీయం బాబూ!

షీ-టా: సరే. అమ్మా! వెళ్ళొస్తా.

భార్య: యీ వైపుకి యెవరన్నా వస్తూంటే నీ క్షేమ సమాచారాలు చెప్పి మరీపంపించు. మీ నాన్నలాగ

అయిపులేకుండా పోకేం. బాబూ! యివిగో యీ డబ్బులుకూడా అట్టిపెట్టుకో.

పీ-టా: సరేనమ్మా! (కన్నీళ్ళు తుడుచుకోని) వెళ్ళొస్తానమ్మా! (దృఢ నిశ్చయంతో తిరిగి గుమ్మంవైపు నడుస్తాడు. గుమ్మం తలకి తగులుతుంది. కట్టు తడుముకుని మళ్ళీ ధైర్యం తెచ్చుకుని తొందరగా వెళ్ళిపోతాడు.)

భార్య: (గుమ్మంవైపు తేరిపారజూస్తూ) బాబూ! బాబూ!

సాంగ్: మనసు కుదటపరుచుకో అమ్మా!

భార్య: (దుఃఖంతో) బాబూ! మాబాబు వకర్నాడన్నా కడుపునిండా తిని యెరగడు పిన్నీ! (ఏడుస్తుంది)

సాంగ్: అవును. యేడుపువస్తుంది. యేడుపువస్తే యేడ్చేసెయ్. అదే మంచిది.

భార్య: వాళ్ళ నాన్నకోసరం పదేళ్లు యెదురుచూశా. తిరిగి రాలేదు. యిప్పుడు కొడుకు కూడా నను వదిలిపెట్టి వెళ్లి పొయ్యాడు... (కొంచెం ఆగి హఠాత్తుగా) అయినా యింకా యెదురుచూస్తూనేవుంటా, యెదురుచూస్తునే వుంటా. ఆ రోజు వచ్చేవరకూ యెదురుచూస్తూనే వుంటా. కష్టాలు కలకాలముండవు. మంచిరోజులు రాకపోవు. ఆ మంచిరోజు కోసరం యెలాగో వకలాగ యెదురుచూస్తుంటా, యెదురుచూస్తుంటా!

తెర

# రెండో అంకం

"మనుష్యులంతా అన్న దమ్ములు
మానవాళి ఒకే కుటుంబం"

[మూడు సంవత్సరాల తర్వాత. ఆకురాలు కాలం. మధ్యాహ్నం. ఉత్తరచీనాలో కొత్తగా విముక్తి పొందిన ప్రాంతంలోని ఒక గ్రామంలో ప్రజావిముక్తి సేన ప్రధాన కార్యాలయం. ఒక రైతు పూరిపాకలో ఒకగది. విముక్తి ప్రాంతాలు గుర్తించిన దేశపటం గోడకు వేలాడుతోంది. పక్కన దేశపటాలు పెట్టెపెట్టి, దూరదర్శిని, ఫ్లాషులైటు, కోట్లు వేలాడుతున్నాయి. బల్లమీద టెలిఫోను ఉంది. కొన్ని బెంచీలు, కుర్చీలు ఉన్నాయి.

తెర లేచేసరికి గదిలో ఎవరూ వుండరు. దూరాన్నుంచి పాట, దగ్గరనించి వివిధ కంఠస్వరాలు, నవ్వులు వినిపిస్తాయి. పాట దగ్గరగా వినిపించి, మళ్ళీ దూరమవుతూంటుంది.

జనతా సేనావాహిని
జయపతాక ధారులం
మానవాళి మంచికోరకు
మరణించే వీరులం!
చేత తుపాకీ ఎదలో
లోతుల క్రోధానలం
కాలాన్నను శాశించే
నేలతల్లి కూనలం!
కటు సమరాగ్నిని కాగిన
కాలాయస మూర్తులం
వీరప్రజా సైనికులం
విప్లవయుగ కర్తలం!"

"వన్! టూ! త్రీ! ఫోర్......" అని అస్పష్టంగా వినిపిస్తుంది. టెలిఫోను మోగుతుంది. చదువుల పంతులు పరుగెత్తుకుంటూ వచ్చి టెలిఫోను తీస్తాడు]

పంతులు: హాల్లో! సెకండ్ బటాలియన్... లేరు... హాల్లో! మా బటాలియన్ కమాండరుగారు యిక్కడలేరు ... నేను, పంతుల్ని మాట్లాడుతున్నా... యెవరూ ఆ మాట్లాడేదీ... ఓ... బటాలియన్ కమాండరుగారు అయిదో కంపెనీ మోర్టారు ప్రాక్టీసు తనిఖీ చెయ్యడానికి వెళ్ళారు...నిమిషంలో వచ్చేస్తారు. ఆఁ-యేమిటీ? రాజకీయం మాస్టారా? ఆయన సిపాయీల కమిటీ మీటింగుకు వెళ్ళారు...నాకు తెలీదే!

[చావో టిమెంచు, నేపథ్యంలో ఉన్న ఎవరితోనో మాట్లాడుతూ గుమ్మంలో ప్రత్యక్షమవుతాడు. ఇప్పుడు పేరు చావో-కాంగ్ అని మార్చుకున్నాడు]

చావో: (కఠినంగా) అయిదోకంపెనీ ప్రాక్టీసుచేస్తున్న విధానం పరిశీలించడానికి ప్రతి ప్లాటూన్నించీ యిద్దరిద్దర్ని పంపమని నాలుగోకంపెనీకి, ఆరో కంపెనీకి తెలియజేయండి. ఆసాకూ యీసాకూ చెప్పితే వొప్పుకునేది లేదు. కాడర్లు సరిగా సన్నద్ధం కావడంమీదనే అంతా ఆధారపడివుంది. యివాళ అయిదో కంపెనీవాళ్ళ ప్రాక్టీసు పరవాలేదు. పేల్చడంలో చురుకు, గురి...

పంతులు: హాల్లో...వక్కనిమిషం వుండండి. మా బటాలియన్ కమాండరుగారు మాట్లాడతారు. కామ్రేడ్ బటాలియన్

కమాండర్! నెంబరు సెవెన్ నించి మీకు ఫోను వచ్చింది.

(చావో స్టేజీమధ్యకి వచ్చి ఫోను ఎత్తుతాడు. ఇపుడు పూర్తిగా మారిపోయినా, పూర్వపు చావో టియే-చు ఇతనేనని గుర్తించవచ్చు. ఏళ్ళు పైబడ్డంవల్ల, అనుభవం, అధికారం, విజ్ఞానం పెరగడంవల్ల అతను పూర్తిగా మారిపోయాడు. గడ్డం నున్నగా ఊదా రంగుగా ఉంది. కాని అతని నిర్మలమయిన పెద్ద పెద్ద కళ్ళల్లో యింకా యవ్వనం, సంకల్పం వ్యక్తమవుతున్నాయి.]

చావో: హల్లో! నెంబరు సెవెన్. చావో కాంగో మాట్లాడుతున్నది. ...ఊఁ- ఊఁ- (ఫోను చేతితో మూసి) పంతులుగారూ, వెళ్ళి రాజకీయం మాస్టారుగార్ని పిలుచుకురాండి. (పంతులు వెడతాడు) ఊఁ...ఊఁ... [తెరలో గొంతులు, "బటాలియన్ సి. ఓ. ని అడుగుదాం." "ఊఁ- సరే, అడుగుదాం." ...షువాంగ్-యెన్, జే-హాయ్ వాదించుకుంటూ వస్తారు.]

షువాంగ్: ఊఁ-.... అడుగు చూదాం!

జే-హామ్: కామ్రేడ్ బటాలియన్ కమాండర్! (కమాండరు ఫోనులో మాట్లాడుతూండడం చూసి వెంటనే ఆగిపోతాడు)

చావో: ఆఁ– ఆఁ– రేపు పొద్దున్నే.... మూడు రోజులకి సరి పోయే రేషను తయారుగా వుంచండి. రోగులు...ఆఁ– ఆజ్ఞలు యెప్పుడు యివ్వను?...

షువాంగ్: (సంతోషంతో ఎగిరి గంతేసి, జే–హాయ్‌ని మోచేత్తో పొడుస్తాడు) దాడికి ఆజ్ఞలు–జారీఅవుతున్నా యోామ్!

జే–హాయ్: (పండ్లికిలిస్తూ) నీకేం వళ్ళు తెలుస్తున్నట్టు లేదే! పిచ్చిపుల్లయ్యా!

షువాంగ్: (గహాస్యంగా) మన మెకట్టడికి బయలుదేరాలో నువ్వేమయినా వూహించగలవూ?

జే–హాయ్: బవుశా ...

[చావో వీరిద్దరికేసి తీక్షణంగా చూస్తాడు. యిద్దరూ యికిలించి పెదవులు కొరుక్కుంటారు]

చావో: ఆఁ– ఆఁ– అంతే. (ఫోనుకింద పెట్టేస్తాడు. మహా ఉద్రేకంలో ఉన్నట్టున్నాడు. గద్దిస్తూన్నట్టు నటిస్తూ) నీవేం వూహిస్తున్నావ్? ఊఁ– వెళ్లి 'ఎయిడీ'ని వెంట బెట్టుకురా.

(పంతులు వస్తాడు)

చావో: సరే. పోనీ వద్దులే. పంతులుగారూ! యిలా వచ్చి ఆజ్ఞాపత్రం రాయండి. ఊఁ– సిద్ధంగా వున్నారా? సైనిక ప్రధానకార్యాలయంనించి ఆజ్ఞలు :

1. రేపు, నిద్రలేవడం ఓ–తర్టీ ఫోర్, ఫలహారాలు ఓ–ఫైవ్ హండ్రెడ్, కవాతు ఓ–సిక్స్ హండ్రెడ్.

2) ఫలహారాలయినాక అన్ని కంపెనీలకు చెందిన రోగులను, క్షతగాత్రులను ప్రధాన కార్యాలయం దగ్గర సమీకరించి బ్రిగేడు ఆసుపత్రికి పంపడం. 3) అన్ని రాంకుల వాళ్ళకీ మూడు పూటలకు సరిపోయే రేషను పంచి పెట్టడం, ఇంకా, హాజరు పట్టీ. 4) త్యాత ప్లాటూన్‌లోని వాళ్ళు, దళాలలోని వాళ్ళు గేస్తుల దగ్గర శెలవు తీసుకుని, వారు చేసిన సహాయానికి కృతజ్ఞత తెల్పడం రైతుల దగ్గిరనించి ఎరువు తీసుకున్నవన్నీ తిరిగి యిచ్చివేసి తీరాలి. యీ విషయంలో క్రమశిక్షణ శాఖ పూర్తిగా పనిచెయ్యాలి. ఆఖరుకి యివాళ రాత్రి బటాలియన్ ప్రధాన కార్యాలయంలో కంపెనీ కమాండర్లూ సిపాయిల కమిటీ అధ్యక్షులూ సమావేశం కావాలి... యివన్నీ తెలియజేస్తూ నోటీసు రాయండి.

(పంతులు నోటీసు రాస్తాడు)

జే-హాయ్: ( చొరవ చేసుకుని ) కామ్రేడ్ బటాలియన్ కమాండర్ ! మళ్ళీ మన కింకో పని తగిలించింది కదూ!

చావో: (తీక్షణంగా చూడాలని యత్నిస్తాడు. గానీ నవ్వంతో పాన్ని అణచుకోలేక) ఊ...భోజనాలయాక రైతుల దగ్గిరనించి ఎరువు తీసుకున్నవన్నీ, ఒకటీ బేరు పోకుండా తిరిగి యిచ్చేయండి. సామానంతా సర్దేసుకోండి. ఏక వస్తువయినా మరిచే పోగూడదు. తెలిసిందా? నా టీ కప్పు మళ్ళీ మర్చిపోయేవు సుమా?

జే-హాయ్: మన చెవల పిల్లులజత నేం జేయాలి? పోనీ, కూడా తీసుకుపోతే?

చావో: (ఓర్పు కోల్పోయి) ఉహూఁ - వాటిని రైతులకిచ్చే యండి యుద్ధానికి పోతూ చంకల్లో చెవల పిల్లు లేవిటి?

షువాంగ్: యీ తడవ యెక్కడికి దాడి వెడలాలి, కామ్రేడ్ కమాండర్ !

చావో: తగిన సమయంలో మీాకే తెలుస్తుందిలే. అది సరే గాని, మీారిద్దరూ యిక్కడేం కేస్తున్నారు !

షువాంగ్: మిమ్మల్నో సంగతి అడగాలని వచ్చాం. అడగ మంటారా?

చావో: ఓ తప్పకుండా అడగండి.

షువాంగ్: మీాకూడా కుటుంబంవుందా బటాలియన్ కమాండర్ ?

చావో: యింతకీ యిప్పుడీ విషయం యెందుకు అడగాల్సి వచ్చింది ?

జే-హోయ్: మేమిద్దరం పందెం వేసుకున్నాం. యింతకుముందే మీాటింగులో మా యిద్దరికీ వాదనయింది. విప్లవపు పనుల్లో మునిగివున్న సిపాయిలకి యింటిబెంగవుండ కూడదన్నాను నేను. కాని వీడు, (షువాంగ్‌ని గడ్డం ఆడించి చూపుతూ) మన యిళ్ళని కాపాడుకోడా నికి విప్లవంలో చేరాంగదా, అలాంటపుడు యింటి బెంగ యెక్కువయినకొద్దీ మనపట్టుదల యెక్కువవు తూంటుందన్నాడు.

షువాంగ్: ఊహుఁ-అబ్బే! నేననా అనలేదే? భూసంస్కరణల మూలకంగా నాకు విముక్తి కలిగింది. కాబట్టి మా వాళ్ళకి కన్నుకోడానికి యింత భూమి, వుంటానికి యిల్లు లభించాయి. కాబట్టే నేను విజయఫలితాలను సంరక్షించేందుకు విప్లవసేనలో చేశాను, అని చెప్పా. నాకో కొంప వుంది. చియాంగ్-కే-షేక్ పటాలాలొచ్చి నా కొంపని లాక్కోవడం నాకిష్టంలేదు యిదంతా ఆలోచించినకొద్దీ యింకా పట్టుదలతో పోరాడాలని బుద్ధి పుడుతోంది.

జే-హుయ్: సరే, సరే నే నన్నాను: పదేళ్ళపై చిలుకునించీ మన బటాలియన్ కమాండరు విప్లవంలో చేరిపని చేస్తున్నారు. కాని యెన్నడూ ఆయనకి యింటిధ్యాసే లేదు. అయితేనేం విప్లవాశయాల కోసరం పోరాడాలనే పట్టుదల ఆయనకి రోజురోజుకీ యెక్కువవుతోంది! దీనిమీద వీడన్నాడు: మన బటాలియన్ కమాండరుకి కుటుంబమంటూ వకటి వుంటేగా, ధ్యాసమళ్ళడానికి? ఆయనకి కుటుంబమే లేదు. ఆపైన మళ్ళా నేనన్నాను: "నే చెప్పదలచిందది కాదు. మన కమాండరుకి కుటుంబమంటూ వుంది. కాని దానిమీదికిధ్యాస మళ్ళకుండా మనసును అరికట్టేశాడు."

చావో: (మందహాసంచేస్తూ)ఊహుఁ-మీరనుకున్నంతనిబ్బరం నాకు లేదు. కామ్రేడ్స్! మీయిద్దరి భావాలూ సక్ర

మంగా నే వున్నాయ్. కాని మీరిద్దరూ అసలు కారణం చెప్పలేక పొయ్యారు.

(పంతులు నోటీసురాయడం పూర్తిచేసి చావోకి ఇస్తాడు.)

చావో: (చదువుకుని ముద్ర నేస్తూ) యిది యిప్పుడే పంపాల్సిన అగత్యంలేదు. రాజకీయం మాస్టారు యింకేమన్నా చేరుస్తారేమో చూద్దాం.

జే-హాయ్: మేం అసలు కారణం చెప్పలే దన్నారే? అంటే... ?

చావో: (జే-హాయ్‌తో) సరే నీ వాద నే తీసుకుందాం. నీకు కుటుంబం వుందా?

జే-హాయ్: ఆం-వుందనే అనుకుంటున్నా. చియాంగ్-కే-షేక్ పటాలంలోకి నన్ను బలవంతాన చేర్చుకున్నాక నా కుటుంబం ఆచూకే తెలీలేదు... మా అమ్మా, నాన్నా యింకా బతికి వుందీలేందీ తెలీదు. వాళ్ళని గురించి ఆలోచించి కూడా లాభంలేదు. అసలీవిషయం ఆలోచించడమంటేనే భయంవేస్తోంది.

చావో: పోరాడుతూ తిరిగి మీవూరు చేరుకోవాలని లేదూ?

జే-హాయ్: ఓ-దక్షిణాదికి బయలుదేరమని మీరు "ఊ" అనాలేగాని వాయువేగంతో వెళ్ళనూ! దోవలో పగ వాళ్ళని నుగ్గు నుగ్గు...

చావో: అంటే నీ మనస్సు మారుమూలల్లో యింటి బెంగ వుందన్నమాటే!

జే-హాయే: వక వేళవున్నా, నా పనికది యేవిధంగానూ అడ్డు రావడం లేదు. యుద్ధంలో పట్టుదలతోనే పోరాడుతున్నాగా.

చావో: యీ పట్టుదలంతకీ కారణ మేవిటంటావ్ ?

జే-హాయ్: కారణమేవిటా ? సరే, చెప్తావినండి. మనం ఉత్తర చీనానికూడా విముక్తి చెయ్యాలి. యెంత తొందరగా దీన్ని విముక్తిచేస్తే అంతతొందరగానూ మధ్య చీనాని, దక్షిణచీనాని విముక్తిచేయచ్చు. అవును. పగతీర్చుకోవాలి. కాని తొందరపడితే యేం లాభం! వకక్క అడుగూ వేసుకుంటూ వెళ్ళాలి. యిందులో నష్టమే వుంది ? మనందరిదీ వకటే కుటుంబంకదూ. మనం యే ప్రాంతాన్ని విముక్తిపరచినా, మనవాళ్ళని విముక్తి పర్చినట్టే లెఖ్ఖ,

చావో: అవును. నువుచెప్పింది సక్రమంగానేవుంది. మనం విప్లవంకోసరం పాటుబడుతున్నంతసేపూ సంసారాల సంగతి వకటీ ఆలోచించలేం.

షువాంగ్: కాని క్కామేడ్ కమాండర్! నేను చెప్పినకారణం యెలావుంది ?

చావో: (షువాంగ్‌తో) విజయఫలితాలను సంరక్షించుకోవడమన్నా యిదేగా. నీ కుటుంబం వకదాన్నే రక్షించుకోవాలని వుందా ? ఉహుం- లేదుగా !

షువాంగ్: లేదు. నా వక కుటుంచాన్నే కాదు, మావూరంతటినీ రక్షించుకోవాలని వుంది. ఉహుం-అలాకాదు.

సరిహద్దు ప్రాంతాన్నంతటినీ, ఊహు - యిదీకాదు. చీనా నంతటినీ రక్షించాలి.

చావో: ఆఁ-అదిగదీ-చీనా నంతటినీ- ఊఁ-మనం యెప్పుడో వక రోజున కమ్యూనిజం స్థాపించబోతున్నాం. బలే! మన సంసారాలని మాత్రమే రక్షించుకోవడం లేదు! (కొంచెం ఆగి) యిది మహత్తరమయిన విషయం. ప్రజలంతా వకర్కొమ్మడిగా నడుం కడితేనే యిది సాధ్య మవుతుంది. చైర్మన్ మావో యేమన్నారు? "సంఘ టితం గండి!" అనలా. సరే, సరే, మనం మన సౌఖ్యం కోసరమే కాకుండా ప్రజలందరి సౌఖ్యంకోసం పోరాడతాం. సమిష్టి ప్రయోజనంకోసరం ప్రతివాడూ తను చేయగలిగిదంతా చెయ్యాలి.

షువాంగ్: ఓ-యిదంతా సహకార సంఘంలా వుంది. ప్రతి వాడికీ వాటా వుంటుంది.

చావో: హూపేని విముక్తి చేసే సమయం వచ్చేసరికి నువ్వా రంగంలో వుండడం పడక పోవచ్చు. కాని యిక్కడ షాన్సీని విముక్తి చేయడం కోసరం నువ్వు, హూపే వాడివి పని చేస్తున్నావు. తెలిసిందా?

జే-హాయ్: సరే కానీండి, మీకూ కుటుంబం వుంది కదండీ?

చావో: కామ్రేడ్! యేం చెప్పాలో నాకే తెలీడంలేదు. నిజం. నాకు కుటుంబమంటూ వుండేది. కాని వదమూడేళ్ళ నించీ వాళ్ళ భోగట్టాయే తెలీడంలేదు. నా కుటుంబం యింకా నిలిచేవుందో లేదో యెవరికి తెలుసు...

షువాంగ్: చియాంగ్-కే-షేక్‌ని ఆఖరు చేసింతరవాత...?

చావో: షువాంగ్! యింకా ఆఖరు చెయ్యలేదుగా! అయితే యిప్పుడు సైన్యాన్ని వదిలి చక్కా పోతానను కుంటున్నావా? శత్రువు చేతిలో ఆయుధాలున్నంత వరకు మనం ఆయుధాలు కిందపెట్టేకిలేదు. (రాజకీయం మాస్టారు చౌ వస్తాడు. సహజంగా కులాసా పురుషుడి లాగా కనిపిస్తాడు.)

చౌ: ఆన మూవేశంలో ప్రజలు తమ తమ కష్టాలు వెళ్ళబోసు కున్నాక మన సిపాయిల పట్టుదల తారాస్థాయికి చేరుకుంది. చూడండి, ఘన కార్యాలు సాధించడానికి ప్రతిజ్ఞలు! వక కంపెనీతో వక కంపెనీ పోటీ పడడం! బలే! యుద్ధానికి బయలుదేరమని యీ క్షణంలో ఆజ్ఞలు జారీ చేస్తే నేను గ్యారంటీ యిస్తా...

చావో: (మందహాసంతో) ఓ-నీ గ్యారంటీని రెడీగా వుంచుకో. రెజిమెంటు ప్రధాన కార్యాలయంనించి ఫోను వచ్చింది. రేపు బయల్దేరడమే!

చౌ: ఓహో! అలాగా? నిన్న రెజిమెంటు పార్టీ కమిటీ సమావేశంలో యీ ప్రస్తావనే రాలేదే!...పరిస్థితిలో యేదో మార్పు వచ్చుంటుంది. మనవాళ్ళకిది తెలిసిందా?

చావో: (చౌకి ఆజ్ఞాపత్రం అందిస్తూ) ఆజ్ఞలని వకమాటు పరిశీలించి నువ్వింకేవయినా చేర్చాల్సినవి వున్నాయేమో చూడు.

చౌ : (అజ్ఞాపత్రాన్ని త్వరిత గతని చూస్తూ మాట్లాడుతాడు.) యీ తడవ మనమెక్కడికి వెళుతున్నాం. పందెం. మన మనుకున్న చోటు కేగదూ? అం-స్పష్టంగా తెలుస్తూనే వుంది. (ముద్ర వేసి) జే-హాయ్ !

జే-హాయ్: (చురుకుగా) రెడీ ?

చౌ : యిది పోస్టు చెయ్యి.

(జే-హాయ్ ఆజ్ఞాపత్రం తీసుకుని వెళ్ళబోతాడు. అతని వెంట షువాంగ్ కూడా వెళతాడు.)

చావో: అజ్ఞలు యింత తొందరగా జారీ అవుతాయనుకోలేదు. వీలయినంతవరకు వొక నిమిషం కూడా వృథా కానీకుండా సిపాయిలకి శిక్షణ యివ్వమనీ, యే క్షణంలోనయినా సరే పోరాటానికి తయారుగా వుండమనీ చెప్పారంటే యిందుకే కావల్సును.

చౌ : హా ! హా! నీ కోరిక ఫలించింది. బలే !

చావో: అంటే ?

చౌ : నీ స్వంత రాష్ట్రాన్ని విముక్తి పరుస్తావు.

చావో: (చిరునవ్వుతో) సరే, సరే కాని అదే అంతముఖ్యమయింది కాదు. యిప్పుడే మన వారొక్కరిద్దరూ నా కుటుంబం సంగతి అడిగారు. కాని నా కుటుంబం వుందో వూడిందో యెవరు చెప్పగలరు ?

చౌ : యేమిటీ? నీకూ తెలీదూ? యిక్కడ మనిద్దరం యేడాది నించీ కలసి పని చేస్తున్నాం. అయితేనేం, యింత

వరకు నువ్వు నీ స్వంత వ్యవహారాలు మాట్లాడం యెన్నడూ నేను వినలేదు. ఆ సమావేశంలో నువ్వు పడ్డ పాట్లని చెప్పనేలేదు. పోనీలే, యిప్పుడు చెప్పు. ఊఁ—కానీ—అవేమిటో బయటపెట్టు.

చావో: పడ్డ కష్టాలేవో పడనే పడ్డాను. మళ్ళీ ఆ పాత గాయాల్ని రేపడమెందుకులే.

చౌ: ఉహూఁ—అదేం వీల్లేదు. చెప్పు, ఊఁ—

చావో: (విషయం తనకేమీ సంబంధించింది కానట్టు) సరే, కానీ. నేను యిల్లు వదిలిపెట్టి వచ్చేసి యిప్పటికి పదమూడేళ్ళయింది వ్యవసాయ కూలీగా పనిచేశా. యూంగ్‌చువాన్ గనుల్లో పనిచేశా. జపాన్ వ్యతిరేక యుద్ధం ప్రారంభం కాగానే రైల్వేలో చిన్న చిన్న పనులు చేశా. తరవాత యెర్రసేనలో చేరిపోయా. మొదట సిపాయిగా పని చేశా. తరవాత నన్ను స్క్వాడ్ లీడరుగా ప్రమోటు చేశారు. ఆ తరవాత ప్లటూన్ లీడర్నయా. తరవాత అసిస్టెంటు పొలిటికల్ ఇన్‌స్ట్రక్టర్ని. ఆ తరవాత కంపెనీ కమాండర్నయా. అప్పుడు నన్ను యెనాన్‌లోని జపాన్ వ్యతిరేక రాజకీయ సైనిక అకాడమీకి పంపారు. నా గొడవ యింతే ననుకుంటూ. వక మాటు గాయపడ్డా. ఆసుపత్రిలో చేర్చారు. గాయాలు నయమయాయి. యింతలో విముక్తి పోరాటం వచ్చింది. యిక తరవాతదంతా నీకు తెలిసిందేగా.

చా: తరవాతదంతా నాకు తెలుసు. నీ కుటుంబం యెలా వుందీ? అనేదే నాకు కావలసింది.

చావో: (యీ మాటలు అతని హృదయ నాళాలను కదిలిస్తాయి. కాని మామూలుగా ఉన్నట్టే కనిపించాలని యత్నిస్తూ) నాళ్ళని వక భూస్వామి పదమూడేళ్ళ కితం వ్యాళ్ళోళ్ళని తరిమేశాడు యిప్పుడెక్కడున్నారో నాకు తెలీదు. వాకబు చేశా కాని లాభం లేకపోయింది... బహుశా చచ్చిపోయుంటారు. అబ్బ! ఆ విషయాలిప్పుడెందుకులే. యింకేం చెప్పమంటావ్ చా తాతా!

చా: నీ కుటుంబంలో యెవరెవరుండే వారు?

చావో: మా నాన్న చాలా యేళ్ళకితమే చనిపోయాడు. యిక నాకు మిగిలింది భార్య, కొడుకు. ఆ విషయాలిప్పుడెందుకులే, పోనిద్దూ, (విషయంమార్చి) ఓ... చా తాత !, చూడు. వకవిషయం నా మనసులో మెదులుతోంది.

చా: (వినిపించుకోనట్లు) నువ్వూ నీ భార్యా చాలా అన్యోన్యంగా వుండే వారనుకుంటా!

చావో: ఊఁ– నీకేలా తెలుసు!

చా: మరేంలేదు. మళ్ళీ పెళ్ళిప్రయత్నాలేమీ చేస్తున్నట్టు లేదులే. ఆమెకోసరం నువ్వు, నీ కోసం ఆమె యెదురు చూస్తున్నట్టున్నారు. మీరిద్దరూ యెదో వకరోజున

తప్పకుండా కలుసుకుంటారు. నే చెప్పాగా చూడు మీా నుర్రాడి కీపాటికి యిరవయ్యో యేడు వచ్చుంటుం దనుకుంటా.

చావో: వాడికీపాటికి పద్ధెనిమిదేళ్లు వచ్చుంటాయి... ఆవిషయా లిప్పుడెందుకులే, పోనిద్దూ.

చా: (క్షమించు అన్నట్లుగా ముఖంపెట్టి చెయ్యూపి) సరే, సరే. అలాగే కానియ్. యింకీవిషయం యెత్తి తేవొాట్లు.

చావో: నేనొకటి చేదామని నిశ్చయించుకున్నా, నీ అభిప్రాయ మేవిటో ముందుగా తెలుసుకోవాలని వుంది. అదేవి టంటే...

చా: (మాటకి అడ్డొవచ్చి) ఓ- అదా. నాకేం చెప్పక్క ర్లేదు. నీ మనసులో విషయం చెబుతాచూడు. యేం పందెం కాస్తావ్?

చావో: (చిరునవ్వుతో) సరే, సరే. చెప్పుకో చూద్దాం.

చా: (పండ్లికిలిస్తూ) యీా యుద్ధంలో మెరుపుదాడిచేసే అవకాశం మనకిమ్మని అడుగుదామను కుంటున్నావు అంతేగదూ?

చావో: అవును. పందెం నువేగెల్చావ్. ఆపని మనకప్పగించ మని అడుగుదాం. ఊఁ- చౌతాత! విజ్ఞప్తి ఒకటి రాయిూ.

చా: (కపట మందహాసంతో ఒక ఉత్తరంతీసి) ఓ-యిదివరకే రాసుంచా. యిక నువ్వు సంతకం పెట్టడమే తరువాయి.

చావో: (ఆశ్చర్యపోయి, చౌని మందలిద్దామనుకుని మళ్ళీ సంతృప్తి చెంది) బలే! యిదివరకే రాసిపెట్టుంచి ఆముక్క చెప్పావుకావేం? (ఉత్తరం చదువుతాడు)

(పంతులు ఉద్రేకంతో పరుగెత్తుకుంటూ వస్తాడు.)

పంతులు: కమాండర్! మాస్టారూ! గాయపడ్డవాళ్లు ఆస్పత్రి నించి వచ్చేశారు.

చావో: (ఉత్సాహంతో) యెంతమంది?

పంతులు: మొత్తం పాతికమంది. వీళ్ళల్లో అయిదోకంపెనీ తాలూకు వాంగ్ టే-చుంగ్, సూయ్ టూ-చి కూడా వున్నారు.

చావో: అందరూ యుద్ధానికి తగే వున్నారా?

పంతులు: ఆ(-వక్క చి తాత తప్ప, అందరూ తగేవున్నారు. తాత యింకా బాగా కోలుకోలేదు.

చావో: (సంతోషంతోచే వీపు చరిచి) చౌ! వీళ్ళ విలువ కట్టలేం!... అందరూ కాకలుదీరిన యోధులు!

[బయట గొంతుల సవ్వడి. ఆ గందరగోళంలో ఈ కింది వాక్యాలు వినిపిస్తాయి.]

"అక్కడ బాగా మానిందా? యెలాగయితేనేం తిరిగొచ్చావ్. అదే పదివేలు."

"ఓ- అంతా దుంగల్లాగా వున్నాం. థాంక్స్!"

"యెందుకో మీారు లేకపోవడం కొరతగానే వుంది."

"ఆస్పత్రినించి తప్పించుకు రావాలని చాలారోజులు కితమే ప్రయత్నించా."

"ఓ— వచ్చావా! యెప్పుడో చచ్చిపోయావనుకున్నాం.
బలే! తిరిగొచ్చావ్ అంతేచాలు."
"అబ్బే! యిప్పట్లో మిమ్మల్ని వదిలే ఘటంకాదిది."
"బటాలియన్ కమాండర్ యేరీ? మాస్టారేరీ ?"
వగైరా—వగైరా.]

చే: (ద్వారంవంక చూస్తూ)
ఓ - రాండి, రాండి.

చావో: (గుమ్మంలోంచి అరుస్తూ) యివాళ స్పెషల్‌గా యెదన్నా వండమని చెప్పండి. మాంసం యింకా దొరుకుతుందీ? ఊఁ— దొరికితే పట్టుకురాండి.
[వాంగ్ టే-చుఙ, సూయ్; పీ—టా, చి తాత ఒకరి తరువాత ఒకరు ప్రవేశిస్తారు. వారివెనక పంతులు, జే—హాయ్ వస్తారు. అందరూ షేక్‌హాండ్సు చేసుకుని సంతోషం ప్రకటిస్తారు. పీ—టా వెనక మనం చూసినప్పటికంటె కొంచెం పొడుగ్గా కనిపిస్తాడు. యూనిఫారంలో ఉండడం మూలంగా ఇంకా నీటుగా, హుందాగా కనిపిస్తాడు. కొందరు కుర్చీలమీద, కొందరు డస్కు బల్ల అంచుమీద, మరికొందరు గోడను ఆనుకుని కూర్చుంటారు.]

చావో: బలే! బలే! అదృష్టంకొద్దీ యివేళే చక్కావచ్చారు. యేమిటీ, యిరవయి అయిదుమంది వచ్చారన్నారు, నలుగురే కనిపిస్తున్నారేం?

వాంగ్: (నిలుచుని) తక్కినవాళ్ళు, పక్కవూళ్ళో ఆలసట తీర్చుకుంటున్నారు. యిక మేం తహతహ పట్టలేక నేరుగా

వచ్చేశాం. పీ–టా! వీరే మా బటాలియన్ కమాండరు చావో. వీరు రాజకీయ మాష్టారు చౌ. (పీ–టా లేచి నిలుచుని సెల్యూట్ చేస్తాడు. చావో, చౌ తిరిగి సెల్యూట్ చేస్తారు. చావో అందరికీ తలాఒక సిగరెట్టు అందిస్తాడు).

చి: ఆస్పత్రిలో వుంటే చూశారూ. సామిరంగా, విగవిగ లాడిపోతాం. అక్కడ్నించి బయటపడేసరికి మా తాతలు దిగొచ్చారంటే నమ్మండి.

చావో: చీ తాత! ఆ గురిపెట్టినవాడెవడో వట్టి చాతకాని వెధవ! నేనే అయితేనా, యీపాటికి నువు చచ్చి స్వర్గంలో వుండేవాడివి.

చి: అబ్బో! ఊం– నను చంపడం మీ తరంకాదు. కమ్యూ నిజం కళ్ళారా చూడకుండా చస్తాననుకున్నావా?

చావో: (మందలిస్తాడు గాని కోపంఉండదు) ఆం– ఆం– జ్ఞాపక మొచ్చింది. కిందటి తడవ యుద్ధంలో నువ్వేంజేస్ావ్? చొక్కా–అదీ వూడదీసేసుకుని చంటిపిల్లాడిలాగా కుప్పి గంతులేస్తూ కాల్పులు సాగించావ్, జ్ఞాపకముందా? యుద్ధంలో అలాంటి పిచ్చిచేష్టలు చేస్తారా యెవర యినా? నవ్వుతున్నావుకదూ? యింకనించీ వంట వాళ్ళైనరూ యుద్ధంలో చెయిచేసుకోగూడదు. ఖచ్చి తంగా యీ నియమం అమలుపరుస్తాం. తెలిసిందా?

చి: (లేచి కళ్ళుపూర్తిగా విప్పి గంభీరంగా) వేళకి వంటచేసి పారేస్తుంటే, ఆ తరవాత నేనెలా యేడిస్తే మటుకు మీా సొమ్మేంపోయింది?

చావో: నా సొమ్మేంపోయిందా ? యుద్ధతంత్రం నీకేమీా తెలియదాయె. యేగుండు దెబ్బకో నువు గుటుక్కుమంటే ఆ తప్పెవరిది?

చి: గుటుక్కుమంటే గోరీ కడతారు. నే చస్తే నామీాద కేసు పెడితే సరి, అప్పుడు మీా రికార్డులకేం భంగం రాదుగా.

చావో: (చిరునవ్వు ఆపుకోలేక, కఠినంగా మాట్లాడాలని యత్నిస్తూ) చూడు, నువెవరివి? వంటవాడివి. వంట యింకా చెయ్యడానికి పాటుపడు! విప్లవంలో నీపాత్ర అదే. యికముందు నీయిష్టం వచ్చినట్లు ప్రవర్తిస్తానికి వీల్లేదు. తెలిసిందా?

చౌ: (సూయ్‌తో) నువుకూడా అయిదోకంపెనీలో వాడివేనా?

సూయ్: ఆఁ- నాపేరు సూయ్‌టా-చి.

చౌ: ఆ- అవునవును. గుర్తొచ్చింది. యుంచెన్ యుద్ధంలో గోడ యెక్కుతూండగా గాయపడ్డది నువ్వేకదూ? బాగా నయమయిందా?

వాంగ్: ఆ- యితనే. ఆస్పత్రినించి చాలారోజుల కిత మే పంపించేశారు. నెలరోజులపాటు తనదళం కోసరం చుట్టుపక్కలంతా గాలించాడు. యెదో అదృష్టవశాత్తూ ఆస్పత్రిలో మాకు తారసిల్లాడు.

చౌ: నువ్వొక్కడివేనా? కూడా యింకెవరన్నా వున్నారా?

సూయ్: యుంచెన్ యుద్ధంలో రెండో బటాలియన్ తాలూకు వాళ్ళం ముగ్గురం గాయాలు తిన్నాం. మమ్మల్ని ముగ్గుర్నీ ఆస్పత్రినించి వకసారే పంపించేశారు. మళ్ళీ ముగ్గురం కలసి తిరిగొచ్చాం. సేన వెనకతట్టున మా చేత పనిచేయించాలని ఆస్పత్రివాళ్లు యెత్తువేశారు. కాని వాళ్ళపప్పులేం మా దగ్గిర వుడకలా. మా దళానికి చేరుకోకుండా ఆపడం వాళ్లతరం కాకపోయింది.

చావో: (దయతో) యిక్కడికి చేరుకోడానికి మహాప్రయాస పడుంటారు. పాపం!

సూయ్: యీమాత్రం ప్రయాస మాకో లెక్కా పత్రమా! మేం బాగానేవున్నాం. సేనలో నలుగురితో కలసి వున్నంతకాలం అనిపించదుగాని, దూరమయితే మాత్రం బెంగ పట్టుకుంటుంది. హోటలు టిక్కట్లు అయిపోయాక మా పని యిరకాటకంలోనే పడిందిగాని, అంతకంటె మిమ్మల్ని కలుసుకోలేక పోయామే అనే బాధ యెక్కువయింది. మీా రెక్కడికి వెళ్ళిందీ తెలీలేదు. చివరికి వో పుకారు విన్నాంగాని అప్పటికే మీారు వెళ్ళిపోయుంటా రనుకున్నాం. మా ముగ్గురి బుర్రలు కలేసి ఆలోచించి, ఆలోచించి చివరికి ఉత్తర చీనాలో మీారున్నంతవరకు ఆరు నూరయినా సరే రెండో బెటాలియన్ని చేరుకోవలసిందేనని నిర్ణయించుకున్నాం. మిమ్మల్ని కలుసుకోడానికి సరిగ్గా నెలమీాద

5 రోజులుపట్టింది. అయితేనేంతిరిగి యింటికిచేరుకున్నాం.

చో: (హృదయం కదలబారి) చావో! యిలాంటి సిపాయి లుండగా విప్లవం విజయంపొందక యేంజేస్తుంది, చెప్పు?

చావో: సేనని స్వంతయిల్లుగా భావించుకునే యీమనస్తత్వం బలే తమాషాగా వుంది. మీరు మాకోసరం బెంగెట్టు కున్నారు! మేం మీ కోసరం బెంగపెట్టుకున్నాం. మీరు విప్లవానికి మూలస్తంభాలు. చో! యివాళ కాకలుతీరిన సిపాయిలు పాతికమంది తిరిగొచ్చారు. వక ప్లాటూను ప్లాటూనే వీళ్ళతో నడపచ్చు ఊహుం— (దృఢ విశ్వాసంతో) వీళ్లు వక బటాలియన్ పెట్టు. మీరు రాకరాక యివాళ రావడం బలే పసందుగా వుంది. మనకివాళ యింకో కొత్తపని తగిలింది. (యీ వార్త వినగానే అందరి మొహాలు వికసిస్తాయి)

పీ—టా: (అమాంతంగా) బటాలియన్ కమాండర్! మనం తయియుయాన్ మీదికి బయలుదేరుతున్నామా?

చావో: (పీ—టా వంకచూసి) యేవిటి సంగతి అబ్బాయి? అసలు నువ్వు యేకంపెనీ తాలూకు?

షీ—టా: నేను మీ కంపెనీలలో దేనితాలూకు వాణ్ణీకాను.

చావో: అదేవిటి?

వాంగ్: (పీ—టా తరఫున వివరించడానికి పూనుకుంటాడు) మాతోబాటు ఆస్పత్రిలో వున్నాడు. యితనేం చిన్న కుర్రాడనుకున్నారా! అబ్బో! చాలా మెప్పులు పొందాడు. కాని యితని దళం పచ్చునది దాటేసింది.

యితను యిక్కడ దిగబడిపోయూడు. మాతో వస్తానని పట్టు పట్టుకు కూర్చుంటే, యేం జెయ్యం? కూడా తీసుకు చక్కా వచ్చాం.

చావో: బాగానేవుందిగాని, ఉహుఁ యీ మాదిరిగా మనలో జేర్చుకోడం యెట్లా?

చౌ: యేం జెయ్యమంటారో, రెజిమెంటువాళ్లనే అడిగితే సరి. (ఫోను పైకెత్తి) హల్లో... స్టాఫ్... ఆఁ స్టాఫేనా? రెండో బటాలియన్ నించి మాట్లాడుతున్నా... యిక్కడికో సిపాయి ఆస్పత్రినించి విడుదలయి వచ్చాడు. అతని దళం పచ్చనదిని దాటి వెళ్ళిపోయింది. దళాన్ని చేరుకోలేక దిగబడిపొయ్యాడు. మా సిపాయీలు కొంతమందితోపాటు ఆస్పత్రినించి మాదగ్గరికి వచ్చేశాడు... అతన్నేం జెయ్యమంటారు?... (షీ-టౌతో) నీ పేరేవిటి?

షీ-టౌ: చావో షీ-టౌ.

చౌ: హల్లో! అతనిపేరు చావో షీ-టౌ. ... (షీ-టౌతో) మీదే ప్రాంతం?

షీ-టౌ: యుట్జ్.

చౌ: హల్లో! యుట్జ్ ప్రాంతం... ఆఁ సరే... కాసేపుంటాను

చావో: (చెవియొగ్గి) నువ్వుయుట్జ్ తాలూకానించి వచ్చావా? యేవ్వూరు?

పీ-టా: చాలాకాలంకితమే తయియుయాన్ వచ్చేశాం. మళ్ళీ యెన్నడూ ఆవైపుకే వెళ్ళలేదు. అంచేత మావూరు సంగతే నేను పట్టించుకోలేదు.

చా: (ఫోను యింకా చెవిదగ్గరే పెట్టుకుని) అయితే మీ యిద్దరిదీ వక వూరే నన్నమాట! ఊం-

చావో: ఊం- (అతనిలో హఠాత్తుగా ఒక వింత ఆలోచన జనిస్తుంది) నీకెన్నేళ్లు?

పీ-టా: పందొమ్మిది.

చావో: (తలవూపి, నవ్వి, తనలో తాను సణుక్కుంటాడు) ఊహుం- అసంభవం!

పీ-టా: (మనఃపూర్వకంగా) అసంభవమేం కాదు.

చావో: యేమిటి అసంభవం కాదు.

పీ-టా: నాకు పందొమ్మిదేళ్ళని చెప్పానంటే పందొమ్మిదేళ్ళే. యిందులో అసంభవ మేవుంది?

చావో: (నవ్వుతూ) ఊహుం- అదికాదు...

చా: హల్లో! హల్లో! యేమన్నారు?... ఆం- ఆం- (ఫోను కిందపెట్టేసి, చావ్‌తో) ప్రస్తుతానికి మన్లోనే అట్టె పెట్టుకోవచ్చు. కాని అవకాశం చిక్కితేమాత్రం అతని దళానికి అతన్ని పంపించెయ్యాలి.

పీ-టా: (విని,విచారంతో) కామ్రేడ్ బటాలియన్ కమాండర్! దక్షిణాదికయితే నేను వెళ్ళేదిలేదు. యిక్కడే వుండిపోతా.

చావో: యేమిటీ?

పీ–టా: (వాంగ్ కేసి చూస్తూ) నేను తయియుయాన్ని పట్టు కోవాలనే వుద్దేశంతో వచ్చాను. అలా కాకపోతే...

చావో: మేం తయియుయాన్ని పట్టుకోబోతున్నామని నీకె వరు చెప్పారు?

పీ–టా: ఓ– అదా. రైతులంతా చెప్పుకుంటున్నారు, లెండి.

చావో: (చౌతో) యిదిగో, మీరు పుకార్లు గికార్లు నమ్మబో కండి. సిపాయీలు కమాండరు మాటలే పాటించాలి సుమా!

పీ–టా: సరే, సరే. ఎలాగయితే నేం, నాకు తయియుయాన్ని విముక్తి పర్చాలని వుంది. అందు కోసరమే నేనిక్కడికి వచ్చా.

చౌ: (చిరునవ్వుతో) నువు తయియుయాన్ పట్టుకోవడం కోసరం మాత్రమే వచ్చావన్నమాట. ఊఁ– మేం తయియుయాన్ మీదికి వెళ్ళకుండా, దక్షిణాదికి బయలు దేరుతున్నామనుకో, అప్పుడేంజేస్తావ్? (తక్కినవారి వంక చూసి) యీ ప్రశ్నకి యెవరు జవాబు చెపుతారు?

తక్కిన వాళ్ళు గందరగోళంగా: మేమూ మీ వెంట వస్తాం. దక్షిణాదికి నడవమంటే దక్షిణాదికే నడుస్తాం. యెక్కడికయినా సరే, తయార్. ఆజ్ఞలు పాటించడమే మావంతు.

జే–హాయ్: దక్షిణాదికి బయలుదేరమని చెప్పండి. మీ మాట శిరసావహిస్తామో, లేదో.

షీ-టా: [తనతో తక్కినవాళ్ళు ఏకీభవించడం లేదని గ్రహించినా, తనపట్టు విడవకుండా] మీాదేంబోయిందీ, యెక్కడికి పదమంటే అక్కడికి తయారవుతారు. కాని మా అమ్మ యింకా అవస్థపడుతూనే వుంది. మా కుటుంబ శత్రువు నాకంట యింకా పడనేలేదు. మా అమ్మ యెన్ని అవమానాలు, యెన్ని బాధలు భరించాల్సి వచ్చిందో మీాకేం తెలుసు?

జే-హాయ్: (ఓర్పుతో) మాకు తెలీదని నీకెలా తెలుసు? మా యిల్లు మీాయింటికెంటె చాలా దూరాన హూపేలో వుంది. అంటే నాకు జరిగిన అన్యాయాలు యిప్పట్లో సర్దుబాటు కావన్నమాట. తెలిసిందా?

చావో: [ఓర్పుతో] నీకుచాలా అన్యాయాలు జరిగివుండచ్చు, కాని నా కుటుంబానికి జరిగిన అన్యాయాలు నీవాటికేం తీసిపోవులే. వక భూస్వామి మూలకంగా మా నాన్న చేతులారా ప్రాణం తీసుకున్నాడు.

షీ-టా: మానాన్ననీ వక భూస్వామి తరిమేస్తే యెక్కడో దూరదేశంలో చచ్చిపొయ్యాడు. నేనూ, మా అమ్మా... [కన్నీరు తుడుచుకుంటాడు]

చావో: [కింది ఉద్యోగులతో అధికార్లు మాట్లాడే స్వరంతో] యేమయితేనేం, నువు అదురుష్ట జాతకుడివి. త్వరలోనే తయియువాంగ్ మీాదికి దండు నడిపిస్తున్నాం. నీకు జరిగిన అన్యాయాలన్నిటినీ పరిహరిస్తాం. (ఆజ్ఞా

పిస్తున్నట్లు) ప్రస్తుతానికిమటుకు నువ్వు బటాలియన్ హార్కారాగా పనిచేస్తుండు.

పీ-టా: (అసంతృప్తితో వాంగ్‌వంకా, తర్వాత బటాలియన్ కమాండర్‌వంకా చూస్తాడు)

వాంగ్: పీ-టా! యిప్పట్లో చెప్పినట్లు నడుచుకో. నువు వేదళంలో వుంటే మట్టుకేం? మనమంతా వక బటాలియన్‌లోనే వుంటాంగా వకరిమొహాలు వకరికి కనిపిస్తూనేవుంటాయ్.

జే-హాయ్: పీ-టా! మాతోవుండు. నీ మూటయదీ? (మూట కోసం నలువైపులా చూస్తాడు)

పీ-టా: మనవి యెక్కడ నించొచ్చిన తుపాకీలు?

షువాంగ్: స్టెన్‌గన్. అమెరికా తయారీ.

పీ-టా: (నవ్వుతూ, కళ్ళు తుడిచికొని) అయితే ఆలస్యమెందుకు? (వెంటనే బయలుదేరుతాడు. జే-హాయ్, షువాంగ్‌లు మూటమొదలయిన సామానులు తీసుకోవడంలో సాయపడి అతనితో వెళ్ళిపోతారు. జే-హాయ్ సలహామేరకు పీ-టా తిరిగివచ్చి చావో, చౌలకు సల్యూట్‌చేసి నిష్క్రమిస్తాడు.)

చావో: (పీ-టా వీపువంక చూస్తూ) యీ కుర్రాడి వాలకం చూస్తే దిట్టమయిన సిపాయిగా తయారయేట్టున్నాడే! కాకపోతే దృష్టి యింకా యిల్లు దాటిపోవడంలేదు. అంతే.

చి: పటాలంలో కొత్తగాచేరినపుడు నాపనీయిలాగే వుండేది.

చౌ: (ఎగతాళిగా) యిపుడు మాత్రమేవిట్లే! ఆ వాసన వదిలిపోయిందేం?

చి: (అనంగీకారంగా) యీ మధ్య నేనుచాలా బాగుపడ్డా.

చౌ: యేవిటి నువ్వుబాగుపడింది? నీ తోటి వాళ్ళంతా ప్లాటూను నాయకులు, డిప్యూటీ కంపెనీ కమాండర్లు అయ్యారు. యిక నువ్వో, యెక్కడవేసిన గొంగళి అక్కడే అన్నట్టు యివాళటికీ వంటవాడివే! యిదేనా యేవిటి బాగుపడ్డమంటే?

చి: (నిర్లక్ష్యంగా) నాకు ఆఫీసరు పనీవద్దు గీఫీసరు పనీవద్దు. అది నా తలకు మించింది. నాకొద్దు బాబూ! వంట చేయడంకూడా విప్లవంలో భాగమేనని విన్నా. దమ్ముంటే కాదనండి చూదాం. (యెవరూ జవాబుచెప్పరు) అవును. నేనూ అలాగే అనుకున్నా. (నవ్వుతాడు. అంతా నవ్వుతారు)

చౌ: (వాంగ్, సూయ్‌లకేసి తిరిగి) వాంగ్, టీ-చున్, సూయ్ టా-చీ!

వాంగ్ }
సూయ్ } యస్. మాస్టారూ!

చౌ: (వాంగ్‌తో) నిన్ను స్క్వాడ్ లీడర్ని చేస్తున్నా. [సూయ్‌తో]నిన్ను డిప్యూటీ స్క్వాడ్ లీడర్ని చేస్తున్నా యేమంటారు?

వాంగ్: మాస్టరుగారూ! (ఆశ్చర్యంతో)

చౌ: మీరిద్దరూ అనుభవంగలవాళ్లు. బాధ్యతలలో అధిక భాగం మీరు నెత్తిన వేసుకోవాలి. కొత్తగా వచ్చిన కామ్రేడ్స్‌కి సాయపడడంలోనేమి, మన బటాలియన్

పేరుప్రతిష్టలు నిలబెట్టడంలో నేమి, కార్య నిర్వాహణలో నేమి మీ మీదనే యెక్కువగా ఆధారపడివుంటాం. యీపనులు చెయ్యగలమని మీకు గట్టినమ్మకముందా?

సూయ్: ఓ- గట్టినమ్మకమే వుంది. కాని...ఆదేశా లిచ్చే నాయకుడి అవసరం నాకెంతో వుంది.

చౌ: యిక నీ సంగతేవిటి వాంగ్?

వాంగ్: [మందహాసంతో] నేను... నేను మామూలు సిపాయిగా వుండడమే మంచిదనుకుంటా.

చౌ: చి తాతకి లాగా నీకూడా యిది తలకుమించినపని అని అనిపిస్తోందా?

వాంగ్: [వ్యాకులపాటుతో] మామూలు సిపాయి విషయం ఆలోచిద్దాం. యుద్ధరంగంలోకి దూకు అంటే దూకుతాను. నాకు చావంటే భయంలేదు. కాని యింకొకర్ని దూకమని ఆజ్ఞలు జారీచెయ్యవలసివచ్చి, వాళ్లకి యేదయినా ఆపద సంభవిస్తే... నా అంతరాత్మ కొట్టుకుంటుంది...

చావో: అంతరాత్మ! యెలాంటిదేం ఆ అంతరాత్మ? విప్లవం నీ వక్కడిమీదనే ఆధారపడి వుందనుకుంటున్నావా?

వాంగ్: ఊహుc- విప్లవానికి అందరం అవసరమే.

చావో: అంచేత నాయకులూ అవసరంలేదు, ఆజ్ఞలూ అవసరంలేదంటావా?

వాంగ్: ఊహుc- అలాఅయితే అంతా గందరగోళంగా తయారవుతుంది.

చావో: ఓ. కె. అయితే ఆజ్ఞలు యెవరు జారీచెయ్యాలి? దృఢ సంకల్పం గలవాళ్ళు, అనుభవంగలవాళ్ళు, ప్రజలని సమీకరించగలశక్తి గలవాళ్లు ఆజ్ఞలు జారీచెయ్యాలి. కొత్తవాళ్లని నాయకుల్ని చేసి అనుభవంగల వాళ్లని నడిపించ మనడం మంచిదంటావా? నువ్వు కమ్యూనిస్టువికూడా కదూ.

వాంగ్: అవును.

చావో: ప్రజాక్షేమమే కమ్యూనిస్టుకి అంతరాత్మ. విప్లవానికి మనం యెపుడు అవసరమయితే అపుడు [గట్టిగా] ముందుకురికి ధైర్యంతో బాధ్యతలను బుజాలమీద వేసుకోవాలి.

వాంగ్: ఓ- యింతేనా? కామ్రేడ్ బటాలియన్ కమాండర్! యిపుడు అర్థమయింది.

(స్టెన్ తుపాకి పుచ్చుకుని షువాంగ్ చకచకా వస్తాడు)

షువాంగ్: బటాలియన్ కమాండర్! మాస్టారూ! ఆస్పత్రినించి విడుదలయిన తతిమ్మావాళ్లుకూడా వచ్చేస్తున్నారు. పాకపైకెక్కి చూస్తే కనిపిస్తారు.

చో: అలానా! అయితే పదండి. పదండి. వాళ్ళకి స్వాగత మిచ్చి తీసుకువద్దాం.

తక్కినవాళ్ళు: ఊం- పదండి, రాండి, రాండి

చావో: నేనూ వస్తా, షువాంగ్!

షువాంగ్: అలాగేరండి.

చావో: నువ్వు యిక్కడేవుండి కోటను కాపాడుతూవుండు. కొత్తగావచ్చిన కామ్రేడ్‌తో స్నేహభావంతో మెలుగుతూ సాయంచెయ్యి. తెలిసిందా?

[చావో, చౌ తదితరులు వెడతారు]

షువాంగ్: (ద్వారంవంక తిరిగి) కామ్రేడ్ చావో పీ-టా!

[కొత్తగా లభించిన స్టెన్ తుపాకి చేత్తోపట్టుకుని పీ-టా ప్రవేశిస్తాడు]

పీ-టా: (ఉత్సాహంతో) రేపేనా బయలుదేరేది?

షువాంగ్: ఆఁ- అవును, రేపే. తలకాయ తెగిరిపోతేపోనీ, మరీ మంచిది. నీకు చక్కటిబూట్లజత వుందా? నువ్వు తొడుక్కున్నదొకటేనా? అయితే యింకోజత యిస్తా తీసుకో.

[బల్లకిందనించి బూట్లుతీసి పీ-టాకి యిస్తాడు. స్టెన్ తుపాకి బుజానపెట్టుకుని, చేత్తో ఒక చొక్కాపట్టుకుని] జే-హాయ్ ప్రవేశిస్తాడు]

జే-హాయ్: కామ్రేడ్ చావో పీ-టా! యిదిగో చొక్కా, తీసుకో.

పీ-టా: మీరు అట్టేపెట్టుకోండి. నేనేదో కొత్తగా సేనలోకి వచ్చినవాణ్ణిగాను. పాతకాపునేగా.

జే-హాయ్: యిది యెవరిదయితేనే? కావలసినవాళ్ళు తొడుక్కోవచ్చు. సరేనా! ఏకొదయినా కావలిసొస్తే అడుగు. మొహమాట పడకేం.

షువాంగ్: మా బటాలియన్‌కి నువ్వుకొత్తేగా. యేదయినా సరిగాలేదనుకుంటే మొహమాటం లేకుండా చెప్పేసెయ్.

పీ-టా: మనం మాపట్నంవిడాదికి బయలుదేరి ఆ స్ఫోటకం మచ్చల యాంగ్‌ని పట్టుకునేంతవరకు నేనేం గొణకల్లే.

జే-హాయ్: యెవడీ యాంగ్?

పీ-టా: యాంగా? వాడో ప్రజాద్రోహి. వాడిమూలకంగానే సేనలో నేను చేరాల్సివచ్చింది. వాడిల్లువల్ల కాదుగాను! జపాన్ వాళ్ళెపుడు లొంగిపోతారా, యెప్పుడువెళ్ళి పగ తీర్చుకుందామా అని యెదురుచూస్తున్నా. యింతలో ఆ వెధవ కొమింటాంగ్ ఆఫీసరయి కూర్చున్నాడు, వెధవ! నేను యిల్లువదిలిపెట్టి మూడేళ్ళయింది. మా అమ్మ యెలావుందోకూడా తెలీదు.

జే-హాయ్ : పీ-టా! బెంగపెట్టుకోకు. నీకు అన్యాయం జరిగితే వకటీ మాకు జరిగితే వకటీనా! పగతీర్చుకోడానికి నీకు మేమంతా సాయపడతాంలే. నువ్వురాకముందు సి. ఒ. అంతామాకు స్పష్టంగా చెప్పారు...... యిదిగో-యిలా...

పీ-టా : (ఆవేశంతో మెచ్చుకుంటూ ఏకాగ్రతతో వింటూ ంటాడు. దూరాన్నుంచి పాట దగ్గిర పడుతుంది, వారి సంభాషణ వినిపించదు.)

[ తెర ]

# మూడో అంకం

## ఒకటో రంగం

"ఉక్కు కరిగి మూసకట్టి ముక్కాకలు తేర్చుటలో
విశ్వమంత పెద్దకొలిమి విప్లవ సేనావాహిని."

[కొన్నిరోజుల తరవాత ఒకనాటి మధ్యాహ్నం. ఆక్రమితతయియుయాన్ పట్టణం బయట (దీనికి సమీపంలో సేటి యే-చు భార్యవున్న గ్రామం వుంది) అడవులలో ఎవరికీ చెందని ప్రదేశంలో మనం వున్నాం. ఎదురుగా శత్రుసేన. శత్రువు వదిలివేసిపోయిన రక్షణదుర్గాలు, నానా ముఖాలా వంకరలు తిరిగే కందకాలు, శతఘ్నికాల్పులకు బద్దలయిన ఒక ఇనపభోషాణం సుఖోబీమీద పడివుంది. దాని పైభాగం ఎగిరిపోయి దగ్గిరలో పడింది. తక్కిన భోషాణమంతా వంగిపోయి ఆఖరిదశలో వుంది. శత్రువుకి ఎదురుగావున్న భోషాణభాగం మాత్రం పాడవలేదు. శత్రువును కనిపెట్టి చూడడానికి రెండు రంధ్రాలుమాత్రం మిగిలున్నాయి. మన సేన ఇక్కడ కందకాలు తవ్వకుని మోహరించి తాత్కాలికంగా విశ్రాంతి స్థలంగా దీన్ని ఉపయోగిస్తోంది.

పారిపోయిన శత్రుసేన తాలూకు ఇసకబస్తాలు, మందుగుండు సామాగ్రిపెట్టెలు, రక్తసిక్తమయిన దుస్తులు, విరిగిపోయిన చెక్కలు గుట్టలు గుట్టలుగా పడివున్నాయి.

ఒక సిపాయి కాపలా కాస్తున్నాడు. తక్కినవారు సుమారు డజను మంది ఆజ్ఞలకోసం ఎదురుచూస్తూ కులాసాగా పొద్దుపుచ్చుతున్నారు. కొందరు పేలుడు వస్తువులను నిలవచేస్తున్నారు. కొందరు తమ తమ తుపాకులను తుడిచి శుభ్రం చేసుకుంటున్నారు. మరికొందరు సన్నీలకు పదును పెడుతున్నారు. అందరూ మహోత్సాహంతో నవ్వుకొంటూ, పేలుతూ పరిహాసా లాడుకుంటున్నారు. ఈ రంగం జరుగుతున్నంత సేపూ నేపథ్యంలో

విమానాలు చక్కర్లు కొట్టడం ధ్వనీ, బాంబులు వేసిన ధ్వనీ, విమానయంత్రాల మోతా కొంతసేపు దగ్గరగా, కొంపసేపు దూరంగా వినిపిస్తాయి. మధ్య మధ్య బాంబుపడ్డ ధభీమనే ధ్వనీ, మరతుపాకుల పటపట ధ్వనీ కలిసి వినిపిస్తాయి. విమానాలను ఎవరూ లక్ష్యం చెయ్యకుండా తమతమ పనులు చేసుకుంటారు. కాకపోతే విమానాలుమరీ దగ్గరిగా వినిపించినపుడుమాత్రం ఒకరో ఇద్దరో తల పైకెత్తి ఒక నిమిషం వాటికేసి ఆదుర్దాగా చూస్తారు.]

**నూయ్:** మెరుపు దాడిచేసే పని మనకి వప్పగించి, మనస్థానంతా అంగీకరించారా, యిక మనం మన దళం పేరుప్రతిష్టలు నిలబెట్టాలి. తెలిసిందా!

1 వ యోధుడు: అవును. సరేకాని యిక్కడి ఆనుపానులు తెలిస్తే బావుండును. యీపైత్రు నించి వచ్చిన వాళ్ళెవరూ మనలో లేరూ?

[షీ–టొ శత్రువుల కంట పడకుండా వుండాలని పరుగెత్తుకుంటూ వస్తాడు. ముచ్చెమటలు పోస్తాయి.]

షీ–టొ : (రొప్పుతూ) యీ వంకర టింకరలు తగలడిపోను! తోవ తెలీడంలేదు. నామచ్చు మూస్తోంది. బాగా విశ్రాంతి తీసుకోమని బటాలియన్ సి. ఒ. గారు చెప్పారు. మన మన స్థానాలకి యింకో గంటలో బయలుదేరాలి. తెలిసిందా?

2 వ యోధుడు : ఆ–షీ–టొ! మనం దాడిచెయ్య బోయ్యేది యీ పట్నంయీదేనా?

షీ–టొ : (ప్రయత్నం మీద) ఆ–అవును. కమాండరుగారి దుర్బిణీలోంచి చూశా. కుయాంతీ గుడి ధ్వజస్తంభం,

గ్రామానికి తూర్పున వున్న రెల్లుపొలాలు స్పష్టంగా కనిపించాయ్. చూస్తూంటేఅవి, యీభోషాణం లాగా, నాకళ్ళ దగ్గిరే వున్నట్టు న్నాయ్. దూకేద్దా మను కున్నా...... నాకు రాత్రల్లా కంటిమీద కునుకే లేదు. వకటే ఆలోచన......

3 వ యోధుడు : యింటికి యెప్పుడు వెళదామా, అని కదూ?

పీ–టా : అబ్బే! సైన్యాన్ని వదిలేసి యింటికి పారి పోదామని ధ్యాసే నాకులేదు. ఊఁ–అప్పటి కప్పుడు యుద్ధం ప్రారంభించా లనిపించింది. రాత్రల్లా యెప్పుడు తెల్లవారు తుందా అని తహతహ లాడిపోయా. మాఅమ్మ యీ వూళ్ళో వుందోలేదో తెలీదు. అసలు బతికే వుందో చచ్చిపోయిందో కూడా తెలీదు. వూళ్ళో కెళ్ళి చూసి వస్తేనే గాని...

2 వ యో : ఆ దుర్భిణీలోంచి చూస్తే శత్రువులు కనిపిస్తు న్నారా?

పీ–టా : ఓ–ఆ లంజాకొడుకులు గుంపులు గుంపులుగా అటూ యిటూ తిరగడం కనిపించింది. రైతుల గుంపుకూడా ఒకటి కనిపించింది. వక ఆఫీసరు లంజాకొడుకు వాళ్ళ చేత అవీ యివీ మోయిస్తూ కర్రుచ్చుకుని గొడ్లని తోలుతున్నట్టు తోలు తున్నాడు. వాళ్ళందరిచేతా సరిగా పనిచేయిస్తూ 'తొందరగా పదండి, తొందరగా పదండి' అని అరుస్తున్నాడు.

1 వ యో : అయితే తెలీక అడుగుతాను. దుర్భిణీ లోంచి చూస్తే దూరపు వస్తువులు కనిపిస్తాయిగాని మాటలు కూడా వినిపిస్తాయా యేం? (అంతా నవ్వుతారు)

సూయ్ : ఇపుడీ కుమ్ములా టెండుకులే! పీ-టా! మీాటింగు జరుగుతోంది కనిపించడంలా?

పీ-టా : కుమ్ములాట! మెరుపు దాడంటే నాకు హుషారుగా వుంది. నన్నూ దానిలో చేర్చుకోండి.

అందరు : ఓ-అలాగే. రా!

1 వ యో : (ఉద్దేశ పూర్వకంగా పీ-టాతో) ఆగు-అసలు మెరుపు దాడిలో చేరడానికి నువ్వెవరివి?

పీ-టా : (కోపంతో) ఓ—బలే ప్రశ్న వేశావ్? యీాదాడిలో మీాకుతక్క యింకెవ్వరూ చేరకూడదా యేం? యీా పని మీా రేమన్నా గుత్తకు పుచ్చుకున్నారా?

1 వ యో : పీ-టా! ఆట్టే గొడవచెయ్యక. మీాటింగు జరుప్కోవాలను కుంటున్నాం.

పీ-టా : ఊం- గొడవ! గొడవ! నాదంతా గొడవంటారూ? మా పట్నాన్ని విముక్తి చెయ్య బోతున్నాం, తెలిసిందా? మెరుపుదాడి చేసే దళంలో నన్ను కలవనీయకుండా యెవరూ ఆపలేరు.

1 వ యో : (నెమ్మదిగా) యిదిగో, విను. నువ్వెంత కొట్టుకున్నా కమాండరుగారి ఆజ్ఞ లేందే యేం లాభంలేదు.

షీ-టొ : వకసారా రెండుసార్లా వందసార్లడిగా. వక మాట యినా జవాబిస్తేనా? యేమయినాసరే నేను మాత్రం మెరుపుదాడి దళంలో చేరేదే నిజం.

1వ యో : షీ-టొ! ఆజ్ఞలులేందేఆపప్పులేంపుడకవ్. తెలిసిందా?

సూయ్ : (అందరినీ సర్ది) కామ్రేడ్స్! యీ మీటింగులో మనం దరం మనమన ధృఢ సంకల్పాలను వెల్లడించాలి. మన మేం చెయ్యనిర్ణయించు కున్నదీ కారణాలతో సహా చెప్పుకుందాం.

1 వ యో : నాధృఢ నిశ్చయాన్ని గూర్చి చెబుతా వినండి. నేను గొప్పమీద మెప్పు పొందాలని నిశ్చయించు కున్నాను. నేను గ్రహించినంత వరకు యెక్కడ చూచినా ప్రజలు మనం చియాంగ్-కే-షేక్‌నీ, వాడి పటాలాలనీ తుడిచిపెట్టేస్తా మని ఆశిస్తున్నారు. మనం వారికి ఆశాభంగం కలిగించకూడదు. యిక మన రైతులని చూద్దాం. యెండనక వానక యేడాది పొడుగునా చెడటోడ్చి పంటలు పండించి మనసేనలకి ఆహార పదార్థాలు పంపుతున్నారు. పైగా మన సామాన్లని, గాయపడ్డ వాళ్ళనీ చేరేస్తున్నారు. వీళ్ళుగాక కార్మికులు, డాక్టర్లు, నర్సులు, మనకోసం మహాకష్ట పడుతున్నారు. యిక మన బటాలియన్ కమాండరు, రాజకీయం మాస్టారూ, కంపెనీ కమాండరు, కంపెని రాజకీయం మాస్టారూ మూడురోజులనించీ నిద్రంటూ యెరగరు

గదా! నేను కమ్యూనిస్టుని. నేను శాయశక్తులా పని చెయ్యకపోతే రేపు ప్రజల మొహం యెలా చూడను?

2 వ యో : నేనూ రెండు మాటలు చెప్పనా?

సూయ్ : ఆఁ కామ్రేడ్! సరే. చెప్పు.

2 వ యో : చూడండి. చియాంగ్-కే-షేక్‌ని తుడిచి పెట్టేయడానికి యింకో యేడాది పడుతుందని ఇ౦జ ప్రి చెప్ప లేదూ? మనం యుద్ధంలో యేవయినా ఘనకార్యాలు చెయ్యదలచుకుంటే యిపుడే సాగిపోయి చేసెయ్యాలి. దేశాన్నంతటినీ జయించింతర్వాత యిక మనం చేసే ఘనకార్యా లేవుంటాయ్? నే చెప్పేది సరిగా వుందా? యివాళ కాకపోతే రేపుమనం యెవరి యిళ్ళకి వాళ్ళం చేరుకుంటాం. ఫలానావాడి కొడుకు యుద్ధాన్నించి తిరిగొచ్చాడని యెరుగూ పొరుగూ ముసలా ముక్కా 'ఘనకార్యా లేవయినా సాధించావా నాయనా? యేవయినా మెప్పులు పొందావా? ఆదర్శ వంతమయిన వాడివిగా తయారయావా?' అని ప్రశ్నిస్తారు. 'అబ్బే నేనేం సాధించలే'దని చెప్పాల్సి వస్తే యేవుంది? తెల్ల మొహం వెయ్యాలి. కాని మనం గనక 'యీ యీ ఘనకార్యాలు చేసినందుకు యీ యీ మెప్పులు పొందాం' నని చెబితే, 'బలే! బలే! పువ్వు పుట్టగానే వాసన తెలుస్తుంది. నువ్వేదో ఘనకార్యం చేస్తావని చిన్నప్పుడే అనుకున్నాం' అంటారు. అంతకంటె మనకి

కావల్సిం దేవుంది? అంతేగాదు, మనం ముసిలాళ్ళ మయాక గడ్డం సవరించుకుంటూ మన మనమల్తో 'యిప్పుడు మీరు హాయిగా బతుకుతున్నా' రంటే దానికి కారణమెవరో మీకు తెలుసా? చియాంగ్-కే-షేక్‌ని పారదోలి మీకు సుఖమయ జీవితం మేం కల్పిం చాం. నా పడుచుదనంలో నేను విముక్తి పోరాటంలో పాల్గొని తయియుర్యాంగ్ యుద్ధంలో మెప్పుపొందా అని చెప్పచ్చు. కాకపోతే చియాంగ్-కే-షేక్, వాడి ముఠా అంటే యేవిటోకూడా అప్పటి వాళ్ళకి తెలియ కుండాపోతుంది. (నవ్వు)

సూయ్:(చిరునవ్వుతో) బలే! బలే! కానీ నీవూహాలు సుతి మించి పోతున్నాయ్. తరవాత యెవరు మాట్లాడ తారు? కామ్రేడ్! నీసంగతేవిటి?

3వయో: (కంగారుగా) నాకు బడబడ వాగడం చాతగాదు... యుద్ధసమయంలో పార్టీలోచేరడం బాగానే వుంది... నాకు మంచి కమ్యూనిస్టుని అని అనిపించుకోవాలనే వుంది...యుద్ధంలో నన్ను కాస్త కనిపెట్టి చూడండి. నేనేగనక తగినస్థాయిలో లేకపోతే ముందుముందు నాకు సాయం చెయ్యండి.

సూయ్: యిప్పుడే పార్టీ సభ్యత్వం పొందాలని నీకుందా ?

3వయో: (తలూపుతూ) ఆఁ

1వయో: అలాగయితే అందుకు తగిన కారణాలు చెప్పు.

3 వయో: ఓ- అలాగే. తగినన్ని కారణాలే వున్నాయి. కమ్యూనిస్టుపార్టీ మూలకంగానే మాకింతపొలం,కొంపా యేర్పడ్డాయ్. మువ్పొద్దులా యింత తింటున్నాం. మా వాళ్ళకి విముక్తి లభించింది కదా అని నేను సేన లోంచి వ్రుడాయించేద్దామనుకోవడంలేదు. యెందుకంటే యింకా విముక్తి పొందని వాళ్లెందరో వున్నారు.వాళ్ళనేం చెయ్యాలి? (రెండవయోధుని కేసి తలూపి) యితని వాళ్ళనీ, పీ-టా వాళ్ళనీ చూడండి! కమ్యూనిస్టులు ప్రజ లందరికోసం పోరాడుతారు. వాళ్లు మంచివాళ్ళు. నే చెప్పగలిగిం దింతే.

సూయ్: యింకేం అంతా స్పష్టంగానే వుంది.

పీ-టా: నాకూ నాలుగు ముక్కలు చెప్పాలని వుంది. చెప్పనా? నేను పార్టీ సభ్యుణ్ణికాను, పార్టీలో చేరదలచినవాళ్లు పేదసాదల్ని విముక్తి పర్చడానికి మాత్రమే కాక కమ్యూ నిజంకోసరంకూడా పోరాడాలని మాస్టారుగారు చెబు తూంటే విన్నా. అంతేనా?

3వయో: పీ-టా చెప్పింది అక్షరాల నిజం. యీ ముక్కలు యింకాక నేను చెబుదామనుకున్నాను గాని మర్చే పోయూ.

సూంజే: పీ-టా చెప్పింది సరిగానేవుంది. పేదప్రజలను విముక్తి పర్చడానికి మాత్రమే కాకుండా కమ్యూనిజం కోసరం

కూడా మనం పోరాడాలి. సోవియట్ యూనియన్ చూడండి! అక్కడ వకరినొకరు పీడించుకు తినరు, దోచుకోరు. అందరికీ పనీపాటా వుంటుంది. అందరికీ చదువుకునే అవకాశాలున్నాయ్. అంతేగాదు వాళ్ళు సమిష్టివ్యవసాయ క్షేత్రాల్లో, వాటినే వాళ్లు గ్రామాలంటార్లే, నాటకాలు, సినిమాలు చూపుతారు. జీవితమంటే అదే జీవితం!

2వయో: సోవియట్ యూనియన్‌లో పెద్దపెద్ద మిషన్లతో వ్యవసాయం చేస్తారని విన్నా.

సూర్య: కామ్రేడ్స్, చూడండి. ఆ విషయాలన్నీ యిప్పుడు చెప్పుకునే వ్యవధి లేదు. అవన్నీ చెప్పాలంటే బోలెడంతవుతుంది. మనం తెలుసుకుతీరాల్సిన విషయాలు యెప్పుడో వకమాటు తీరుబడి చేసుకుని చెప్పమని మాస్టారుగారిని అడుగుదాం సరేనా?

అంతా: సరే, సరే. అప్పుడే తెలుసుకుందాం. మించిపోయిందేవుంది!

సూర్య: యింతవరకు మీరు చెప్పిన కారణాలూ, మీమీ దృఢ సంకల్పాలూ బాగానేవున్నాయ్. వాటిని తిరిగీ వక మాటు చెబుతా వినండి. మన రైతుల్ని విముక్తి పర్చేందుకు మనం చియాంగ్-కే-షేక్ తో పోరాడుతున్నాం. కాని యిదంతా చివరికి కమ్యూనిజం స్థాపించుకోవాలనే

లక్ష్యంతో చేస్తున్నాం. ఇవాళ రక్తం పొలుకుతుం దనీ, అనేకమంది ఆహుతయి పోయారనీ భయపడా ల్సిన పనిలేదు. యెందుకంటే ఆ త్యాగం వృధాపోదు. యిక అరే కుర్రాడా! యిక నీ నిశ్చయాన్నికూడా చెప్పు చూదాం.

షీ—టౌ: బాగానేవుంది గాని, నేను మీాదళంలోవాడిని కానాయె. మెరుపుదాడిలో పాల్గొంటానికి వీల్లేదాయె. మెప్పు పొందే అవకాశంకూడా లేనపుడు యిక చెప్పి యేవిటి లాభం?

సూయ్: చూడు. హార్కారుకూడా మెప్పుపొందచ్చు. అదిగో ఆ చాంగ్ పావ్ ష్యయాన్ని చూడు. అతను నిజంగా అందరికీ ఆదర్శప్రాయుడు.

షీ—టౌ: ఆదర్శప్రాయుణ్ణి కావాలని నాకేం లేదు.

సూయ్: మాటలకేం? ఓ తియ్యగా మాట్లాడతావ్. (షీ—టౌను అనుకరిస్తూ) కమ్యూనిజంకోసరం పోరాటం! మాటలు కోటలు దాటతాయ్, హుఁ—

షీ—టౌ: ఇకచాలు, కట్టిపెట్టండి. పోరాటం తీసుకురావడం కోసరం యెవరూ పోరాడరు...ఊ హుఁ— అలాకాదు. పోరాటాన్ని గుర్తించకుండా...ఛత్! యేవిటో కలగా పులగంగావుంది. కమ్యూనిజం సాధించడానికి యెవరు పోరాడకుండా వుండగలరు? కమ్యూనజం మనకివిగ్నా నాన్ని, సౌఖ్యాన్నీ ప్రసాదిస్తుందని యెవరికి తెలీదు?

మెప్పుపొందే అవకాశం నాకు లేకుండా చేస్తున్నారు. నే చెప్పదలచిందింతే, అదిగో, అక్కడ చూడండి. అది నాస్వంత పట్నం. మా అమ్మ అక్కడ దౌర్జన్యాలకు గురిఅవుతూ నానా కష్టాలూ పడుతూంది. యిక చెప్పండి, నేను చూస్తూ యెలా వూరుకోను?

సూయ్: సరే, సరే. నే నేదో తమాషాకి అన్నాలే. మూర్ఛబో యిదిగో సెల్యూట్ చేస్తున్నా. (సెల్యూట్ చేస్తాడు)

పీ-బా: (హఠాత్తుగా దుఃఖం పొంగుతుంది. కళ్ళవెంట నీరు కారుతుంది. కళ్లు తుడుచుకుని) మెప్పు పొందకుండా మా అమ్మ మొహంయెలా చూడను? నా కా వుద్దేశం లేదనుకున్నారా యేం?

(తుపాకీ తీసుకుని వెళ్ళిపోతాడు)

1వయో: పాపం! వాణ్ణి తలకిందులు చేసేశావుగదా!

సూయ్: ఉహుఁ–వాడు కమాండరుగారికోసరం వెళ్ళాడు.

1వయో: యెందుకేం?

సూయ్: మెరుపుదాడిలో చేరమని అనుమతిమ్మని అడగటాని కనుకుంటా. ఇంతకుముందు చాలాసార్లు అడగడం కమాండరుగారు నిరాకరించడం జరిగింది.

1వయో: నేనే గనక బటాలియన్ కమాండరు నయితే అతని అనుమతి యిస్తా.

2వయో: ఉహుఁ–నేను వప్పుకోను. మనం చులకనయిపోతాం

1వయో: కుర్రాడు! వాడు చెప్పదలిచిందేవిటో పూర్తిగా చెప్పనియ్యకూడదూ? యివాళ మనం వాళ్ళ పట్నం మీాద దాడిచేస్తున్నాం. అదీ నే చెప్పదలిచింది. పి–టా యీాప్రాంతం ఆనుపానులన్నీ బాగా తెలిసుంటాయ్ అందుకని పీ–టాని గనక మనకి దారిచూపడానికినియో గిస్తే సరిపోతుంది. మనంతట మనం బయలుదేరితే చీకట్లో తడుముకున్నట్లే వుంటుంది.

అందరు: (చప్పట్లుకొడుతూ) భేష్! భేష్! ముచ్చెంల్లాంటి ముక్క–న్నావ్. బటాలియన్ కమాండరుగారికి యీా విషయం సూచిద్దాం యేమంటారో.

(కందకంలోకి వాంగ్ పరుగెత్తుకుంటూ వస్తాడు)

అందరు: అడిగో, దళనాయకుడు! తిరిగివచ్చేశాడు, యేవిటి? యేవయింది; యిక బయల్దేరటమేనా? వేళయిందా?...

వాంగ్: (మొహంమీాదిచెమట, దుమ్మూ తుడుచుకుంటూ) ఊ–అందరూ మామూలుగా వున్నారా? అంతా సవ్యంగా వుందా? బయలుదేరే వేళయింది. పరిస్థితి...

(చావో, చౌ, జే–హాయ్. సూంగ్ ప్రవేశిస్తారు)

వాంగ్: సల్యూాట్!

(అంతా సల్యూాట్ చేస్తారు, హావో, చౌలు తిరిగి సల్యూాట్ చేస్తారు.)

చావో: (చుట్టూ పరికించి) యీా స్థలం బాగా నేవుంది. (భోషాణం కేసి చూసి) కమాండు పోస్టు గా ఇది బాగా పనికొస్తుంది.

చౌ: (వాంగ్, సూయ్‌లతో) సన్నాహాలు పూర్తయాయా?

వాగ్ం:- ఆc- పూర్తయాయ్.

2వయో: ఆc-యేవుందీ, వాళ్ళనిలా చప్పరించేస్తాం.

చౌ: చప్పరించేయగలరేం! యున్-సి-షాన్ యిక్కడ తన సేనలో మెరికలవంటి వార్ని, సాయుధులయిన భూస్వాములీ్న, అట్టెబెట్టాడు. యీాతడవ నల్లేరుమీాద బండిలా యేం సాగదు, తెలిసిందా?

చావో: అరే! యేవిటంత పొగ కమ్మింది? ఆ ఔషధాలు యిళ్ళకి నిప్పెట్టడం లేదుగదా?

(చీ తాత ఆహారపదార్థాలు పెట్టిన బుట్ట బుజాలకి తగిలించుకొని ప్రవేశిస్తాడు)

చీ: యిదిగో, కడుపునిండా మేత! రాండి! చిట్టి చిట్టి పాపల్లారా! నాపాపల్లారా! అంతా రాండి, రాండి. యివిగో కయిమావుండలు, కయిమావుండలు! రా రండహాోయ్!

(చావోని, చౌని చూసి చేత్తో నోరు మూసుకుంటాడు. సిపాయిలు అతనిచుట్టూచేరి బుట్టలోవి తీసుకుని తింటూంటారు.)

సూయ్: (చావ్‌తో) కమాండరుగారూ! మాదో సూచన వుంది. చెప్పమంటారా?

చావో: యేవిటది? నిరభ్యంతరంగా చెప్పు. భయమెందుకు?
(సూయ్ నెమ్మదిగా చావోతో చెపుతూ చేతులు ఆడిస్తూ వుంటాడు. మధ్యమధ్య 'షీ-టౌ, పరిస్థితి' అనే మాటలు మాత్రం వినిపిస్తాయి)

4వయో: (చీవో) యేంచీ తాతా! యీతడవా మాతో వస్తావా?

చీ: (చిరచిరలాడుతూ) ఉహుఁ- నే నెక్కడికీ రాను, బాబు. మళ్ళీ కమాండరుగారి చేత చివాట్లు తింటానికా? (ఆలోచించి, తట్టుకోలేక) కమాండరుగారూ!

చౌ: (చావోతో) సరే, వీణ్ణి వెళ్ళనిద్దూ.

చీ: (సంతోషంతో) కోటిదండాలు!

చావో: నాకెందుకోయ్ నీదండాలు?

చీ: పోరాటంలో నేను చేరవచ్చని యిపుడే అనుమతిచ్చారు.

చావో: (కఠినంగా) వంట బాగా చెయ్యడంలో చేరచ్చు. తెలిసిందా?... యివాళ యేవేవి చేశావ్?

చీ: కయిమా వుండలు చేశా. వకటి రుచిచూడండి. మాస్టారూ, మీరొకటి పుచ్చుకోండి. వీట్లో మాంసం దిట్టంగా వేశా.

చౌ: (ఒకటి తీసుకొని కొరికి) మన కంపెనీలో ఆహారం బాగా బాగుపడిందే! (చావోతో) యేవిటి ఆలోచిస్తున్నావ్?

చావో: ఆఁ- యేవుంది? ఆకుర్రాడి సంగతి యింకా తటపటా యిస్తున్నా. యిప్పటికి వెయ్యి సార్లు అడిగాడు

హూరాక్-రాదళంలోంచి పోతానని పట్టుపట్టి కూర్చు
న్నాడు. కాని నేను వప్పుకోలేను. యీతడవ గనక.....

(చౌ కయిమూవుడ తింటుంటాడు. చౌ, చావో
లిదర్దూ మాట్లాడుకుంటూ వెళ్ళిపోతారు. షువాంగే, జే-హాయ్‌లు
వారి వెనుక వెళతారు. చీతాతకి చేయడాని కేంపనిలేక వెడు
తున్న వారి వంక చూస్తుంటాడు. దీర్ఘంగా నిట్టూరుస్తాడు.
జే-హాయ్ తిరిగివచ్చి కమాండు పోస్టును స్థాపించి ఎర్రజండా
కడతాడు)

వాంగ్ : ఫాలిన్! నంబర్ ఆఫ్! రైట్టర్న్! ఫార్వర్డ్ మార్చ్!

(వాంగ్ ముందు బయలుదేరుతాడు. జే-హాయ్, చీతాత
"జనతా సేనా వాహిని" తప్ప తక్కిన వాళ్ళంతా వాంగ్ వెనుక
వెడతారు. ఎవరోఒకరు, పాట మొదలు పెడతారు. పాట బహు
ఆకర్షణీయంగా ఉంటుంది. ఒకొక్కరు పాట అందుకుంటారు
పాట క్రమంగా దూరమవుతుంది. యోధులు చీతాత పక్కగా.
వెడుతూ అతనితో 'షేక్‌హాండు' చేస్తారు. కొందరు అతనిని
చూచి చిరునవ్వు నవ్వుతారు. మరికొందరు వేళాకోళంచేసి
ఉలికిస్తారు.)

చీ : (ఒకొక్కరినీ పొగుడుతూ) బాగా పోట్లాడండి. యీ
తడవ తప్పకుండా మెప్పుపొందాలి సుమా! ఆకుర్రకుంక
కేసి చూడండి...... .

(సెలవు అన్నట్లు చేయిఆడిస్తాడు.)

(అందరూ వెళ్ళిపోతారు. సంగీతం క్రమేపి వినిపించ కుండాపోతుంది. తమతమ పనులు చేసుకుంటూ జే-హాయ్, సిగ్నల్ ఆపరేటరు మెల్లిగా పైపాటనే పాడు తూంటారు. చీతాత బుట్టను శుభ్రంగా తుడుస్తాడు.)

జే-హాయ్ : (వేళాకోళంగా) యేం తాతా! యీతడవ చేతులు ముడుచుకుని కూర్చున్నావేం?

చీ : (నిరాశతో) కమాండరుగారు యీ వంటపని కూడా ముఖ్యమయిందే ననిచెప్పాలా. వంటపని వదిలేసిచక్కా బోతే యెట్లా?

జే-హాయ్ : పాపం! తుపాకీ పట్టాలనే నీ వుబలాటం యీతడవ తీరదు కదూ!

చీ : ఆఁ— అదేంమాట! వుబలాటం! వుబలాటం! నాకేం మతి పోయిందను కున్నావా? కామ్రేడ్! యుద్ధం జరిగిన ప్రతితడవా, మంచి యవ్వనంలో మిసమిసలాడే యువ కులు ప్రాణాలకి లెక్క చెయ్యకుండా, నిర్భయంగా ముందుకు దూకుతూంటే నాకు ఆవేశం వస్తుంది. విప్లవానికి నేనింకా తగినంతగా కృషిచెయ్యలేక పోయానే అని అనిపిస్తుంది....

జే-హాయ్ : తగినంత చెయ్యక పోవడ మేమిటి?

చీ : నే నలాగే అనుకుంటున్నా. (ఆవేశంతో) వాళ్ళనిచూడు, వకడి తరవాత వకడు ఆపదలని లక్ష్యం చెయ్యకుండా,

ధైర్యంతో ముందుకు సాగిపోతున్నారు. వాళ్ళేం పదవుల కోసరం సాగిపోతున్నారా? డబ్బుకోసరం సాగిపోతున్నారా? ఉహుఁ— ముందున్న వాళ్ళు నేల కొరిగితే, వెనకవాళ్లెళ్ళి ముందునిల బడతారు. (తొడచరిచి బొటన వేలు పైకుండే లాగా గుప్పెడుపట్టి) యిదీ మన ప్రజల ధర్మసేక్ష. యిలాంటి దీక్షతో పోరాడుతూంటే విప్లవం విజయవంతం కాకపోతే నాతల తరిగేశెయ్.

(చీతాత బుట్టతీసుకుని వెళ్ళి పోతాను. పీ—టా ఉరుక్కుంటూ వచ్చి చీతాతని ఢీ కొంటాడు)

పీ—టా : తాతా! వాళ్ళు వెళ్లి పొయ్యారా? ఊఁ— తొందరగా చెప్పు,

చీ : యెవళ్ళూ?

పీ—టా : మెరుపుదాడి దళం వాళ్లు.

చీ : వాళ్ళా! వెళ్లి పొయ్యారు.

పీ—టా : (వెళ్ళబోతూ) ఛీ, నాకోసరం ఆక్కుండా వెళ్లి పొయ్యారా (వెనక్కి తిరిగి) జే-హాయ్! నా మాట చూస్తూవుండు. సరేనా?

జే—హాయ్ : యెక్కడికి వెళదామను కుంటున్నావేం?

పీ—టా : నేనా? మెరుపుదాడి దళంలో చేరిపోతా.

జే—హాయ్ : నిన్ను వెళ్ళమని యెవరు చెప్పారు?

పీ-టా : వకళ్లు చెప్పేదేవిటి? నేనే వెళుతున్నా.
(ఉరుకుతూంటూ వెళ్ళి పోతాడు)

చీ : బలే! నీ అంతట నువ్వే వెళుతున్నావా? నేను వెళతానంటే
వప్పుకుని చావరుగా! (వెళతాడు)

జే-హాయ్ : (ఆలోచించి, ఏదో పొరపాటు జరిగిందని గ్రహించి
బిగ్గరగా) పీ-టా!

పీ-టా : (ఆగకుండా పరుగెత్తుకుంటూ వెళతాడు)

సిగ్నల్ ఆపరేటరు : (ఫోనులో మాట్లాడాలని యత్నిస్తూ)
హాల్లో! హాల్లో! సెకండ్ బటాలియన్ లైను కనెక్టు
చేశాం.

(పంతులు ప్రవేశం)

పంతులు : వకడివే వున్నావేం?

సిగ్నల్ : జే-హాయ్ పీ-టాని వెదకడానికి, వెళ్ళాడు.

పంతులు . ఓ- అదా! పీ-టా అనుమతి యిచ్చేదాకా ఆగ
లేదన్నమాట. 'ఫ్రెంచిలీవు' తీసుకున్నాడూ?

(చావో, చౌ, షువాంగ్ ప్రవేశిస్తారు.)

చావో : యేం జరిగిందేవిటి?

(సిగ్నల్ ఆపరేటరుతో) రెజిమెంటు ప్రధాన కార్యా
లయం వాళ్ళని పిలు. హారాకారీ లేరి?

పంతులు : జే-హాయ్, పీ-టాని వెదకడానికి వెళ్ళాడు.

షువాంగ్ : షీ-టా యిక పారిపోయినట్టేనా యేం?

చావో : అబ్బే! షీ-టా అలాంటిపని చేసే మనిషికాదే!

చా : అలాగయితే యెక్కడికి వెళ్ళుంటాడు?

పంతులు: బహుశా, మెరుపుదాడి దళంలో చేరడానికి వెళ్ళుంటాడు. వెళ్ళనిమ్మని చాలాసార్లు అడిగాడుగా.

చావో: యేవిటీ? అనుమతిలేకుండా వెళ్ళాడూ! అదేం పనికిరాదు. షువాంగ్! నువ్వెళ్ళి వాణ్ణితీసుకు చక్కారా.

షువాంగ్: వాడు మెరపుదాడి దళంలో చేరడానికి మీరిద్దరూ అంగీకరించారనుకున్నా. నాకేం తెలుసు? పోనీ వెళ్ళితే వెళ్ళనిద్దురూ.

చావో: (గట్టిగా) వెళ్ళి తీసుకురా. (ఆవేశంతో) ఊఁ— యిక వాణ్ణి వెళ్ళనిచ్చేదిలేదు.
(చావో ఫోనుదగ్గిరికి వెళతాడు. షువాంగ్ వెళ్ళిపోతాడు.)

చావో: హల్లో! రెంజిమెంటు ప్రధాన కార్యాలయమేనా?
(చావో ఫోనుదగ్గిరఉండగా చౌ 'మ్యాపు' చూస్తూంటాడు. షీ-టాను ఈడ్చుకుంటూ జే-హాయ్ తిరిగి వస్తాడు. వెనుక షువాంగ్ వస్తాడు. జే-హాయ్ షీ-టా తోమాట్లాడుతుంటాడు.)

జే-హాయ్: మనంమెప్పులు పొందడానికి పెట్టుకున్న షరతులు మర్చిపోయావా? ఆదేశాలను, ఆజ్ఞలను పాటించాలనేది మొదటి షరతుగదూ?

షీ-:టా యీా వకమాటుకు వూరుకుందూ. నేను పగతీస్చు కున్నాక మీాయిష్టం. యేంచెయ్యమంటే అదిచేస్తా. నన్నెందుకు వెళ్ళద్దంటున్నారో అర్థంకావడంలా.

చావో: (ఫోనుపెట్టేసి చౌ వంకతిరిగి) పొలిమేరలోని శత్రువు లని ముందు తుడిచిపెట్టెసెయ్యమని ఆజ్ఞలువచ్చాయి. వక పురుగునయినా వూళ్ళోకి వెళ్ళనీయకండి. మన సర్వసేనాని చూ-టె యీాయుద్ధం యెంతో ప్రధాన మయిందంటున్నాడు. (షీ-టౌని చూసి) ఊఁ- తిరిగి వచ్చావా? భేష్! సేనని వదిలేసి యెందుకు పారి పొయ్యావ్ ?

షీటా-: (మనసు చివుక్కుమంది.) బటాలియన్ కమాండరు గారూ! నేను సేనని వదిలేసి పారిపోదలచుకుంటే ఆసుపత్రినుంచి యెపుడో పారిపొయ్యేవాణ్ణి. యిక్కడ దాకా వచ్చేవాణ్ణా! సిపాయిలు పారిపోరు. నిజం.

చావో: ఊఁ! నువుచేసింది తప్పుగాదనేగా నీ అభిప్రాయం ? అనుమతిలేకుండా యెందుకు వెళ్ళావో చెప్పు?

షీ-టా: మిమ్మల్ని చాలాసార్లు అడిగా. మీారు జవాబే యిచ్చారు కాదు.

చౌ: (మ్యాపుచూస్తూనే అడ్డువచ్చి) నువ్వెంతట నువ్వే యేనిర్ణయమూా తీసుకోకూడదు. తెలిసిందా? అనుమతి యివ్వకపోతే వెళ్ళడం మానేయాల్సిందే.

షీ-టా: నన్ను దేశంలోంచి వెళ్ళిపోనిమ్మనేం అడగలేదే ? యీ తడవ వకసారికిమాత్రం మెరుపుదాడిలో పాల్గొన నిమ్మన్నాను. అంతే.

చౌ : ఒకమాటయితేనేం వందసార్లయితేనేం? పైవాళ్ళ అనుమతిలేకుండా పాల్గొంటానికి వీల్లేదు. బాగా ఆలోచించుకో. తొందరగా తత్వవప్పేసుకోవడం మంచిది.

షీ-టా యిందులో ఆలోచించుకోడానికేవుంది ? నేనేం తప్పు చెయ్యాలేదే? అదిగో, మాయిల్లు. మాఅమ్మ బతికేవుందో, చచ్చేపోయిందో తెలీదు. ఆకనిపించేదే మీ యిల్లయితే మీకుమతిపొయ్యేది కాదూ?

చావో: యిదిగో, యిపుడే మీవాళ్ళని శత్రువులనుంచి విముక్తి పరుస్తాం. తెలిసిందా?

షీ-టా: నేనే స్వయంగా వగదీర్చుకోవాలి. నాదినేను స్వాధీన పర్చుకోకుండా నన్నెవరూ ఆపలేరు. నేనూ, మా అమ్మా యెన్నిఅవస్థలుపడ్డామో మీకేం తెలుసు?... పసితనంలోనే మానాన్నని పోగొట్టుకున్నాను. మా అమ్మ యింటింటికీవెళ్ళి ముష్టెత్తి నన్ను పెంచి పెద్దవాణ్ణి చేసింది. తరువాత నాకు పధ్నాలుగోయేడు వచ్చిందగ్గరినుంచీ వ్యవసాయకూలీగా పనిచేశా. తింటానికి సరిగా తిండిదొరికేదికాదు. తాగడానికి పచ్చిమంచినీళ్ళయినా దొరికేవికావు......నరకం అనుభవించాం. ఆస్ఫోటకం మచ్చలదూరాంగ్ మూలకంగా యింటోపడుండడానికి

కూడా పిల్లేసి పోయింది. యిల్లు వదలిపెట్టి వచ్చి పటాలంలో చేరా. మూడేళ్ళయింది... యింటి దగ్గిర అమ్మను వంటరిగా వదిలేసి చక్కా వచ్చా, యేమయి పోయిందో...(ఏడుస్తాడు)

చావో: (కోపంతగ్గింది) యేడవకు. నువెంత బాధపడుతున్నావో నాకు తెలుసు...నువ్వు యిల్లువిడిచిపెట్టి మూడేళ్ళ యింది. యింకా నువ్వు పగ తీర్చుకోలేదు. యిక నేనో యిల్లు వదలిపెట్టి పదమూడేళ్ళయింది. నేనూ యింకా పగ తీర్చుకోలేదు.

పి-టా: నాబాధ మీకేం తెలుస్తుంది? మీరెలాగయినా ఆఫీసరుగా రావెను!

చావో: ఆఫీసరుకీ నీకూ తేడా యేవుంది? ఆఫీసర్లు కూడా మీలోంచి పైకి వచ్చినవాళ్ళే. యెప్పటికయినా నువ్వూ ఆఫీసరువి కావచ్చు. నేను పటాలంలోచేరిన కొత్తలో నీలాగానే బాధపడ్డా. పగ! పగ! పగ తీర్చు కోవాలనే నా ఆలోచనంతా వైయక్తికంగా మన కెన్ని అన్యాయాలు జరిగినా పగతీర్చుకోడానికి అందరి సమిష్టికృషి కావాలి. విప్లవం అందరికీ సంబంధించింది. తెలిసిందా?

పి-టా: యీమాత్రం యెవరికి తెలీదు!

చావో: తెలిస్తే సరే మంచిది. ప్రతి వకరూ సంస్థనీ, క్రమశిక్ష ణనీ లెక్కచెయ్యకుండా యెవరి యిష్టంవచ్చినట్లు

వాళ్ళు చేసుకుపోతుంటే యుద్ధంలో మనం జయించ గలమా? యీవిధంగా అయితే నువ్వు పగ తీర్చుకో గలుగుతావా?

(షీ–టా అమాంతంగా ఏదో అనబోతాడు)

చావో: షీ–టా! బాగా ఆలోచించుకుని మరీ జవాబు చెప్పు.

షీ–టా: (ఎంతో కష్టంమీద) అవును, నా దే తప్పు......పొర బడ్డా. క్షమించండి.

చా: యికనించీ నీఅంతట నువే యింకేమీ చెయ్యవుగదూ?

షీ–టా: చెయ్యను. (కన్నీళ్లు తుడుచుకుంటాడు)

చావో; చావోషీ–టా!

షీ–టా: యస్. కామ్రేడ్ బటాలియన్ కమాండర్!

చావో: యీచుట్టుపక్కల దోవలన్నీ నీకు బాగా తెలుసు కాబట్టి మెరుపుదాడి దళానికి దారిచూపించు. వాళ్లతో కలిసి పనిచేస్తూ, వాళ్ళ ఆదేశాలను పాటిస్తూండు, కాని యేపరిస్థితులలోనూ నీఅంతట నువే పనిచెయ్యకు, శత్రువుల కంటబడకుండా తప్పించుకోడం మర్చిపోకు. మెరుపుదాడి దళానికి దోవచూపటమే నీవంతు పని. నీ పని అయింతర్వాత వెంటనే బటాలియన్ ప్రధాన కార్యాలయానికి తిరిగి రావాలి. తెలిసిందా?

యావో: యేమిటీ రభసంతా? యెవరు వీళ్లు?

కు. సి. 1: మీతో పితూరీ చెప్తున్నారు సార్! వీళ్లు వూరి బయటి గుడిసెలవాళ్లు. ఆ గుడిసెలకి నిప్పంటించామని రభస చేస్తున్నారు సార్...!

యావో: (అధికారస్వరంతో) వీళ్ళంతా ఆ గుడిసెలు ఖాళీ చెయ్యాల్సిందే. ఈ గొడవలు మా దగ్గిరేం పనికిరావ్.

కు. సి. 1 (ప్రజతో) విన్నారా? యిక నోరుమూసుకుని చచ్చినట్టు పడుండండి.

యావో: యీ గడ్డుసమయంలో అల్లరు లేపదీయ జూస్తున్నారా! యెన్నిగుండెలున్నాయిరా మీకు?(పళ్లు పటపట కొరుకుతూ) వెధవలు మీరంతా యింతే! అంతా శత్రు పక్షాన్నే పని చేస్తున్నారు. మీరు ద్రోహులు, గూఢచారులు! మీకు అంతకంతా శాస్తి చేయాల్రా. (తుపాకికోసం వెతుకుతాడు) (గుడివైపు నుంచి కు. సి. 5 పరుగెత్తుకుంటూ వస్తాడు)

కు. సి. 5 : సార్! శత్రువుల కాల్పులకి మనవాళ్లు తట్టుకోలేక పోతున్నారు. కంపెనీ కమాండరు చచ్చిపోయాడు. సిపాయిలు యింకా ఆట్టేసేపు యుద్ధం చేసేటట్టు లేరు. అప్పుడే ఒక దళందళం లొంగిపోయింది. సగంమంది వెనక్కి పారిపోతున్నారు. ఆర్మీ కమాండరుగారు వెంటనే అదనపు సేనని పంపి[illegible]

యూవో: (కు. సి. 5తో) యిక నువ్వు ప్రత్యేక సిబ్బంది కంపె
నీకి వెళ్ళి మా నాన్నగార్ని మాంచుయాంగ్ తీసు
కెళ్ళడానికి యెవర్నన్నా పురమాయించమను. యివి
నా ఆజ్ఞలని మరీ చెప్పు. ఊఁ—(కు. సి. 5 వెళతాడు)

యూవో: వెధవల్లారా! వినండి. మనమో శత్రువులో యీ
దెబ్బతో తేలిపోవాలి. చావనన్నా చావండి కాని ఆ
వెధవ విముక్తి సేనకిమాత్రం లొంగిపోకండి. వాళ్లు
మీచుట్టూ యీగల్లాగా మూగుతారు. పూరిస్తారు.
కాని వాళ్లు వొట్టి దొంగపుండాకొడుకులు. తడిగుడ్డ
లతో గొంతులు కోస్తారు. యెవరన్నావరే లొంగి
పోదామని చూసారో, అక్కడి కక్కడే కాల్చి
పారేస్తాం. జాగర్త. యిక్కడ యెవరన్నా వుక్కుసేన
తాలూకు మనుష్యులున్నారా? (కు. సి. 1అటెన్షన్‌లో
నిలుచుంటాడు) నువ్వు అందరికంటె యెక్కువగా పాటు
పడాలి. బహుమతి లభిస్తుంది. అనుమానస్తుల్ని, మన
వాళ్ళని దిగజారదీసేవాళ్ళని వెంటనే కాల్చిపారేసెయ్.
నా ఆజ్ఞలకోసరమేం ఆగక్కర్లా. తెలిసిందా?

ప్రజ: (మోకరిల్లి) కమాండకుగారూ! కమాండరుగారూ!
మీకు పుణ్యం వుంటుంది, మమ్మల్ని వదిలిపెట్టండి.
మా అమ్మ యింకా గుడిసిలోనే పడుంది. అక్కడే
వుంటే నిలువునా కాలిపోతుంది. కాస్త దయదల్చండి
కమాండరుగారూ!

యావో: (కంపితస్వరంతో) నీ దేదళం? రెండో కంపెనీయా? (కు, సి 2తో) మీ కమాండరుతో నా ఆజ్ఞలుగా యిలా చెప్పు: ప్రస్తుతానికి శత్రుదాడులని గురించి భయపడాల్సిన అవసరంలేదు! రక్షణదుర్గాలు కట్టుదిట్టంగానే వున్నాయి. యిక్కడ వక ప్లాటును అట్టే పెడితే చాలు. తక్కిన రెంటినీ తీసుకుని స్వయంగా బయల్దేరి వూరికి తూర్పుగా వెళ్ళి మూడో కంపెనీకి కుడివైపునవున్న రక్షణదుర్గాలనించి పోరాడమని చెప్పు. (సిపాయి వెళ్ళబోతాడు) ఆగు! చివరిదాకా పెనుగులాడమని నేను ఆజ్ఞాపించానని చెప్పు. శత్రువులు శతఘ్నులు వుపయోగించినాసరే. పరవాలేదు. కందకాల్లో దాక్కోమను. కాల్పులు ఆగిపోగానే యెవరిస్థానాల్లో వాళ్ళుండాలి వెంటనే తిరుగుదాడులకు సన్నాహం చెయ్యాలి. యెవరన్నాసరే, వెనుదిరిగారా, వెంటనే కాల్చేయమని చెప్పు. ఊఁ— (కు. సి. 2 వెళతాడు)

యావో: (కు. సి. 4కేసి తిరిగి) బటాలియన్ రెండో కమాండరుతో చెప్పు: మళ్ళీ ప్రధాన కార్యాలయం వాళ్ళని ఫోనులో పిలిచి త్వరత్వరగా అదనపు సేనలని పంపించమని చెప్పమను. శతఘ్ని రక్షణశ్రేణి మరీ పాడుగయిపోయింది. శత్రుశతఘ్నుల ధాకకు తట్టుకోలేక పోతున్నారు. వెధవ విమానాలు! సమయానికి రాకుండా పోతాయ్.

(కు. సి. 4 వెళతాడు)

టుంది. తెలిసిందా ? అంతేకాదు, వాళ్ళేగనక యీ వూరంతా ఆక్రమించుకుంటే మిమ్మల్నందరినీ చంపి పారేసి మీ ఆస్తంతా నాశనం చేసేస్తారు. (హఠాత్తుగా మంటలు లేస్తాయి. నల్లటిపొగ ఆకాశంఎత్తున లేస్తుంది. ప్రజలలో నుంచి 'కొంపలు తగలడి పోతున్నాయి.' అని హాహాకారం బయలుదేరుతుంది. ఒక స్త్రీ బిగ్గరగా ఏడుస్తూ సందుగుమ్మం వైపుకి పరుగెత్తుతుంది. కమింటాంగ్ సిపాయిలు ఎంత అడ్డువెట్టినా తోసుకుని ప్రజ ఆమె వెంట నడుస్తారు. అకస్మికంగా కు. సి. 1 ప్రజలమీద తుపాకీ పేలుస్తాడు. భయకంపితులయి ప్రజాసమూహం కొయ్యబారిపోతారు. ఇంకో స్త్రీ ఇసుకబస్తాలమీద పడిపోతుంది. తలవాలిపోతుంది.)

క. సి. 1: ఊc— పారిపోతున్నారూ? యెవడ్రాఅది? యెన్ని గుండెలో పారిపోతున్నార్రా? ఊc—

(తొందర తొందరగా యాంగ్‌యావో-సూ ప్రవేశిస్తాడు. అతనివెనుక కొందరు కుమింటాంగ్ సిపాయిలుంటారు. ఒకటో అంకం రెండో రంగంలో కనిపించినంత తలబిరుసుగానే ఇప్పుడూ కనిపిస్తాడు. అమెరికన్ యూనిఫారం ధరించాడు. ఆందోళన పడుతూంటాడు. అతనిని చూడగానే కు. సిపాయిలు సల్యూట్ చేస్తారు.)

దయతలచండి. ఆఫీసరుగారూ! ఆఫీసరుగారూ! పోనీ యింటోనించి పక్కబట్టలన్నా తెచ్చుకోనీండి.

క. సి. 1: యిదిగో చూడండి. మాకు ఆర్డర్లు వచ్చాయి. యికమేం చెయ్యగలిగిందేంలేదు. యేదన్నా చెప్పుకో దలుచుకుంటే యాంగ్ కమాండరుగారితో చెప్పుకోండి. (చుట్టూఉన్న ప్రజలను దిట్టంగా కొడతాడు.)

క. సి. 2: మీ కొంపలు యుద్ధరంగానికి అడ్డంగావున్నాయ్. మాశాల్పులకి అడ్డం వస్తున్నాయ్. యుద్ధరంగం సాఫు చేస్తున్నాం. అంతే, మీకొకరికేకాదు. యీ తిప్పలు. యిదివరకే వుత్తరంవైపు కొంపలకీ, తూర్పు వైపు కొంపలకీ నిప్పంటించాం.

క. సి. 1: ఎందుకురా వృధాగా గొంతు చించుకోవడం! వీళ్లుయిక్కడనించి కదలకపోతే యింతకింతకు వాళ్లేఅనుభవిస్తారు. (ప్రజతో) మీమీద మాకు చాలా అనుమానంగావుంది. ఊం— పదండి. పదండి. (తుపాకిమడమతో కొడతాడు.) మీ అంతట మీరేపోతారా పొండి, లేకపోతే మిమ్మల్నందర్నీ యీనిమిషంలోనే కాల్చిపారేస్తాం. (క. సి. 3తో) అట్లాచూస్తూవేంరా, పిడికిళ్ళతో పొడవక! పొను. ఊం— తన్ను, చితకతన్ను.

క. సి. 2: మీవెధవ గుడిసెలు మాదోవకి అడ్డంగాచచ్చాయి. వాట్ని తగలెయ్యకపోతే, మీ "విముక్తిసేన" మామీదదాడిచెయ్యడానికి మెట్టుగా వుపయోగించుకుం

# రెండో రంగం

## "పగవారున్నంతవరకు పోరు సాగవలసిందే"

[మొదటిరంగం అయిన వెనువెంటనే, సాయంకాలం.

మనం ఆ గ్రామంలో ఉన్నట్లే ఉంటుంది. ఎదురుగా శత్రురక్షణ శ్రేణులు. చాలా మందమయిన మట్టిగోడ, మధ్యలో రక్షణద్వారం ద్వారానికి అడ్డంగా ఇసుకబస్తాలు. గ్రామంలోకి వెళ్ళటానికి రావటానికి ఇరుకయినదోవ. గోడవెంట, ద్వారానికి కుడిప్రైపున ఎత్తయిన మంచెలు. వాటికి మెట్లు. ద్వారానికి ఎడమప్రక్కన ఇనుపభోషాణం. మూతిచుట్టూ అర్ధచంద్రాకారంలో వేసిన యిసుక బస్తాలు. ఎక్కడజూచినా పొగ, దుమ్ము, శతఘ్ని గర్జనలు, తుపాకీ ధ్వనులు, పెద్దకేకలు, మహా గందరగోళంగా ఉంటుంది.

ముగ్గురు కొమింటాంగ్ సిపాయిలు తెరవెనుకనుంచి ఇరుకుత్రోవగుండా ప్రజలను త్రోసుకుంటూ గ్రామంలోకి ప్రవేశిస్తుంటారు. ప్రజలు ఏడుస్తూ వెనుదిరిగి పోవడానికి యత్నిస్తారు. కాని కొమింటాంగ్ సిపాయిలు వాళ్ళని కొడుతూ, తిడుతూ ఇరుకు త్రోవగుండా తోసేస్తుంటారు.]

కుమింగ్‌టాంగ్ సిపాయి: వెధవలంజా కొడుకుల్లారా! వెనక్కితిరిగారో మిమ్మల్నందరినీ గూఢచారులకింద లెక్కగట్టేస్తాం. గ్నాపకం వుంచుకోండి. ఊఁ– పదండి, పదండి ముందడుగు వెయ్యకపోయ్యారో, పేల్చిపారేస్తాం. జాగర్త.

ప్రజ: (ఏక కంఠంతో) మాకొంపలు తగులెట్టాశారా! యిక మా పిల్లాజల్లల్తో యెక్కడ పడిచావడం? ...నీ గడ్డం పట్టుకుంటాం. వొక్కనిమషం ఆగండి. మా అమ్మ గుడ్డిది. యింట్లోనే వుండిపోయింది. ... ...నీ కాళ్ళు మొక్కుతాం. ఆగుడిసె అసలే పడిపోయింది, దానిని కాస్తా తగలెట్టేయకండి. పైన భగవంతుడున్నాడు

(శతఘ్ని కాల్పులు ప్రారంభమవుతాయి. నెత్తి మీదుగా గుళ్ళు బుయ్‌మంటూ దూసుకు పోతుంటాయి. తెర జారుతూంటుంది...

నేపథ్యంలో కేకలు:

సూటిగా కాలుస్తున్నారు.

ఊఁ—కానీ.

ఊఁ— మళ్ళీ మళ్ళీ.

శతఘ్నులు తిరిగీ గర్జిస్తాయి.

సంతోషంతో నవ్వులు.

బలే! బలే! భెష్! భెష్! అదీదెబ్బ! యిక పదండి.

చౌ: (ఫోను తీసి) హల్లో! హల్లో! హల్లో!

తెర



పీ-టె: (ఆశ్చర్యపోయి, కన్నీళ్ళతో పాటు మందహాసంచేస్తూ) కమాండరుగారూ! మొసపుదాడి దళాన్ని చేరుకో మంటారా?

చౌ: (యికిలిస్తూ) తొందరగా తప్పు వప్పుకోడం మంచిదని నేను చెప్పలా!

పీ-టె: నా పనిని సవ్యంగా నిర్వహిస్తానని ప్రమాణంచేస్తున్నా యిక యీ నిమిషంలోనే వెళ్ళిపోనా?

చావో: నువు చెయ్యవలసిం దేమిటో అర్థమయిందా? నీ కిచ్చిన ఆజ్ఞ లేమిటో చెప్పు.

పీ-టె: దారిమాపనం. శత్రువుల కంట బడకుండా తప్పించు కోవడం, ఆజ్ఞలు పాటించడం.

చావో: భేష్! యిక వెళ్ళు.

(అమితోత్సాహంతో పీ-టె గౌరవపురస్సరంగా చౌ కి చావోకి సెల్యూట్ చేసి వురుక్కుంటూ వెళ్ళిపోతాడు)

చావో: అందుకే వాడంటే నాకెంతో అభిమానం యేర్పడింది. (గడియారంవంక చూసి) దాడి ప్రారంభించే వేళ కావచ్చింది. హార్కాగా!

జే-హాగ్రస: యిదిగో. యిక్కడే వున్నానండి.

చావో: నాతో రా. (ఇద్దరూ వెళ్ళిపోతారు)

పంతులు: మాస్టారూ! చూడండి. అబ్బ! యెంత పొగ కమ్ము కుందో! శత్రుసిపాయిలు గుడిసెలకి నిప్పంటిస్తున్నట్టు న్నారు

యూవో: అదనపు సేనా లేదు, గిదనపు సేనా లేదు. పైవాళ్ళని లాక్కురాండి. వెనక్కి పారిపోతున్న వాళ్ళ నందర్నీ మరతుపాకుల్తో కాల్చేయమని మీా సి. ఒ. తో చెప్పు ప్రధాన కార్యాలయంలోని ముష్టి వెధవలు మనకి ద్రోహం చేశారు. వెధవలు! అందుకే మనం నదిదగ్గరి రంగంలో దెబ్బతిన్నాం. (కు. సి. 4 పరుగెత్తుకుంటూ వస్తాడు.)

కు. సి. 4: సార్! ఆక్టింగు కమాండర్ హుయాంగ్ గారు అన్నారు: కమ్యూనిష్టులు మన ప్రధాన సేనమీాదే దాడి చేస్తున్నారు. అందుకని అదనంగా యెవర్నీ మీాకు పంపించలేను. చివరిదాకా నిలబడి పోరాడాలని, అవసర మయితే ప్రాణాన్ని సహితం ధారపోయమనీ ఆజ్ఞలు జారీ చేశారు.

యూవో: (మహాకోపంతో) చివరిదాకా నిలబడి పోరాడాలా!—యిదేనా చివరిదాకా పోరాడటమంటే! ఊఁ సరే, సరే. నేనే వెళ్ళి స్వయంగా సేనల్ని నడుపుతాను. ఊఁ పదండి. (వెళ్ళబోతాడు. ప్రజలు ఏడుస్తూ అతన్ని బతిమాలుతారు).

యూవో: పొండి, పొండి. (కు. సి. 1తో) దోవకడ్డంగా వున్నారు, వీళ్ళందర్నీ దూరంగా తరిమేసెయ్. యింకే మయినా గడబిడ చేస్తే కాల్చిపారేసెయ్యండి. నా

ప్రాణమో; శత్రుప్రాణమో, నేనో వాళ్ళో ఒకా దెబ్బతో తేలిపోవాలి.

(కొంతమంది కుమింటాంగ్ సిపాయిలు వెంటరాగా యావో ఆందోళనతో కుడివైపుగా నిష్క్రమిస్తాడు. కు. సి. 1, 3 ఎడమవైపుకి ప్రజలను తోలుకుపోతారు. ప్రజా సమూహంతోవున్న చు. భార్య మెల్లిగా నడు. స్తుంది. కు. సి. 1 ఆమెని తుపాకిమడమతో కొడతాడు ఆమె కింద పడిపోతుంది. సాంగ్‌పిన్ని ఆమెను లేవ దీయడానికి పరుగెత్తుకుంటూ వస్తుంది.)

కు. సు. 1 : ఊం– నడు – నడు.

సాంగ్: ఆఫీసరుగారూ! కాస్త దయదలచండి. అసలే రోగిష్టిని కొట్టబోకండి.

కు. సి. 1: (వెనక్కి తిరిగిచూసి) అలాగయితే ఆమెని త్వరగా నడవమను. పారిపోవాలని చూసావో, (ఒక శవాన్ని చూపి) ఆగతే మీకూ పడుతుంది. జాగర్త. (నిష్క్ర- మిస్తాడు.)

సాంగ్: (చు. భార్యని లేవదీసి) అమ్మాయీ!

భార్య: నాతోపాటు నువ్వూ అవస్థపడ్డ మెందుకు పిన్నీ!

సాంగ్: అబ్బే! అలాఅనబోకమ్మా! బొందిలో ప్రాణమున్నంత వరకూ యెలాగో వకలాగ బయటపడాలి గదమ్మా! (చు. భార్యకి చేయూతఇచ్చి నడిపించుకుంటూ వెళు

తుంది. ఇద్దరూ ఎడమవైపుగా నిష్క్రమిస్తారు. మర తుపాకుల ధ్వనీ, చేతిబాంబులు పేలినధ్వనీ దగ్గరగా వినిపిస్తుంది. కుడివైపునుంచి యావో ప్రవేశిస్తాడు. వెంట కొంతమంది కు. సిపాయిలు వస్తారు. అందరూ యుద్ధరంగంనించి తిరోగమిస్తున్నవారే!)

యావో: (కలవరపాటుతో) యెదురు దాడిచెయ్యమని చెప్పండి. ఊఁ— చెప్పండి చివరికి వక్క సిపాయి మిగిలినా ఆ వక్కడూ వంటరిగా పోరాడ వలసిందే. నాకోసరం ప్రాణా లర్పించాల్సిందే. (కు. సు. 4తో) మొదటి కంపెనీ వాళ్ళతో పార్శ్వానికి వక ప్లాటూన్ని పంపించి అక్కడినించి శత్రువులను తరిమివేయమని చెప్పు. వక్క అరగంట సేపు నిలదొక్కుంటే అదనపు సేనవచ్చి కలుస్తుంది.

(గడియారం కేసి చూసి గోడపక్కన నిరాశతో కూర్చుంటాడు. సిపాయి వెళతాడు.

యాంగ్‌యా—టే భయంతో కంపించిపోతూ యావో—సు, యావో—సు అంటూ ప్రవేశిస్తాడు. గడ్డం నెరిసి పోయింది. తెగ బలిసాడు. కళ్ళకింద, దవడల మీద కండలు ముద్దలుగా వేలాడుతూంటాయి. పూర్తిగా కుమింటాంగ్ ఆఫీసరు దుస్తులు

ధరించాడు. బాడ్జి ఉంది. పొట్టమీదికి గడియారంగొలుసు వేలాడుతోంది. నెత్తిమీద సిపాయిటోపి, మడమలదగ్గిర లాగూ వెనక్కి తిప్పి బిగించి కట్టాడు. తుపాకీ వేలాడుతోంది. అయోమయావస్థలో ఉన్నట్టు కనిపిస్తాడు.)

యాంగ్ : (రొప్పుతూ) యానో-సు! య్యానో-సు ... యెలా? యెలా? ...

యావో : నాన్నా! యింకా తప్పించుకు వెళ్ళలా?

యాంగ్ : యెలా తప్పించుకు వెళ్ళనూ? దక్షిణావైపున కూడా ఆ వెధవ కమ్యూనిష్టులే చచ్చారాయె.

యావో : (అదిరిపోయి) యేమిటి? దక్షిణావైపున కూడానా?

యాంగ్ : అరే! అబ్బాయీ! విషవాయువు ప్రయోగించరా; చచ్చూరుకుంటారు. ఊఁ- ప్రయోగించు.

యావో : యెలా నాన్నా! గాలేమో వాలుగాలేదు. పైగా కమ్యూనిష్టులు మన కంటె యెత్తున వున్నారు యింకెట్లా?

యాంగ్ : అలాఅయితే- ఊఁ- తొందర తొందరగా చక్ర బంధాన్ని ఛేదించెయ్యండి. నేను దాటుకు పోతాను.

యాహో: నాన్నా! తొందరగా వెళ్ళి సామాన్యరైతు వేషం వేసుకో...

[ఇలా ఆందోళనతో మాట్లాడుతుండగా ఎడమ వైపునించి పెద్దపేలుడు వినిపిస్తుంది. దుమ్ము, పొగ స్టేజీ మీదికి వ్యాపిస్తాయి. కు. సిపాయిలు హడలిపోతూ పేలుడు ధ్వనివచ్చిన ఎడమవైపుకి గుడ్లప్పగించి చూస్తారు.]

యాహో: (సంబాళించుకోవాలని యత్నిస్తూ) హడలిపోతూ అటూఇటూ పరుగెత్తకండి. నిబ్బరంగా నిల్చోండి. యేం రోగమొచ్చిందేం? (కు. సి. 3 పరుగెత్తుకుంటూ వస్తాడు. నేపథ్యంలో చేతిబాంబూలు పేలినధ్వని)

కు. సి. 3: దక్షిణాన్నించి యెర్రసేన వూళ్ళో ప్రవేశించింది సాద్? ఆ పేల్చింది వాళ్ళే.

యాహో: అరేయ్! యిలారా. మానాన్నగార్ని యే రైతు యింటికన్నా తీసికెళ్ళి రైతులా వేషంవేసి యెలాగో అలాగ మాచుయాంగ్‌కి పంపించెయ్యి. నీ కష్టం వృథాపోనియ్యనులే.

యాంగ్: (వణుకుతూ) ఓ— నీకు గొప్ప బహుమానం దొరుకుతుందిలేరా. (కు. సి. 3 చొక్కా చెయ్యి పట్టుకుని ప్రయాసతో మెల్లిగా నడుస్తూ నిష్క్రమిస్తాడు).

యాహో: (పిచ్చివాడిలా) మరతుపాకీ! మరతుపాకీ! యీవైపుకి తిప్పు. యీ వైపుకి దెబ్బరాకుండా అడ్డంగొట్టు. యేమయినాసరే, యీప్లాటూను యిక్కడే దెప్పుంది [illegible]

స్థానాన్ని చేతిలో వుంచుకోవాలి. శత్రువును చొర నియ్యకండి. (కు. సి. 2 తో) వెళ్లు. వెళ్లి యిక్కడికి మూడోకంపెనీని తక్షణం తీసుకురా. కువాంతీ కుడి దగ్గిర సిపాయిల్ని కేంద్రీకరించండి. ఊం— పద. తొందరగా పద. (కాలితో నేలతన్ని) వెధవలు! వెధవలు దక్షిణ వైపుకి కూడా చేరుకున్నారూ! ఊం—[కు. సి. 7 ఇనపభోషాణంలోంచి పాక్కుంటూ వచ్చి ఎడమ వైపుకి తిరిగిఉన్న మర తుపాకిని సిద్ధంచేస్తాడు. యూవో కొంతమంది సిపాయిలను వెంటబెట్టుకుని కుడి వైపుగా నిష్క్రమిస్తాడు. "లొంగిపొండి. లొంగిపోతే మిమ్మల్ని చంపం." అనే కేకలు ఎడమవైపున తెరలో వినిపిస్తాయి. కు. సి. 7 హఠాత్తుగా తుపాకి కాలుస్తాడు. స్టేజీమీదికి వచ్చి చేతిబాంబు పేలుతుంది. కు. సి. 7 గిర్రున తిరిగి కిందపడి ప్రాణాలు వదులుతాడు. ప్రజావిముక్తి సేన స్టేజీమీద దృగ్గోచరమవుతుంది. మొదటి యోధుడు ఇనపభోషాణం మీదికి ఎక్కి మరతుపాకిని కుడివైపుకితిప్పి కాల్పులుసాగిస్తాడు. పీ–టా ఇనపభోషాణంమీద ఎర్రజండా ప్రతిష్ఠించి శత్రువులమీదికి దూకపోతాడు. కాని వాంగ్ వారిస్తాడు)

వాంగ్: పిచ్చినాయనా! వెనక్కివచ్చి తలదాచుకో. వెనకవున్న వాళ్ళతో సంబంధం పెట్టుకోవద్దూ? కామ్రేడ్స్! చేతి బాంబులు సిద్ధంచెయ్యండి. నేను సంజ్ఞచేస్తాను. సంజ్ఞ చెయ్యగానే అందరూ వక్కమారే పేల్చాలి. [మర

ఫిరంగుల ధ్వనులూ, తుపాకుల ధ్వనులూ పెద్దగా వినిపిస్తాయి. ఇసుకబస్తాలనించి దుమ్ము రేగుతుంది.]

వాంగ్: (1వ యోధునితో) మందుగుండు సామగ్రి వృధా చెయ్యకు.

1వ యో: అది మందికాదు, శత్రువుది. మరేం పరావాలేదులే.

వాంగ్: అది పూర్వం శత్రువుదేగాని యిప్పుడు మనది. ఊఁ— అంతా పడుకోండి. నేను చెప్పగానే అంతా వకక్క సారిగా పేల్చండి. వకటి, రెండు...

(అంతా చేతిబాంబులు విసురుతారు. పేలుతాయి. శత్రుసేన నించి ఏడ్పులు, పెడబొబ్బలు వినిపిస్తాయి.)

1వ యో: రాండి, రాండి. వాళ్ళమీద దూకుదాం. రాండి. అరె! పారిపోతున్నారే!

2వ యో: (బిగ్గరగా) లొంగిపోండి. మీ ప్రాణాలకేం భయం లేదు. భూస్వాములకోసరం మీరు ప్రాణాలు పోగొట్టుకోడం దేనికి? (జే-హాయ్ ఉరుకుతూ వస్తాడు)

జ-హాయ్: (ఇసక బస్తాలమీదికి వంగి) వాళ్ళు వచ్చేస్తున్నారు. వాళ్ళ శ్రేణులలోకి యింకా చొచ్చుకుపొమ్మని మనకి ఆజ్ఞలిచ్చారు. బటాలియన్ సి. ఒ. అన్నారు: 'నాలుగో కంపెనీ, ఆరోకంపెనీ ఆగ్నేయదిశనించి లోపలికి ప్రవేశించాయ్. మీరు కువాంతీ గుడిదాకా తోసుకువెళ్ళి అక్కడి శత్రుమూకల్ని తుడిచి పెట్టెయ్యండి.' (ఇసక బస్తాలమీద పడిపోతాడు)

వాంగ్: జే-హాయ్! జే-హాయ్! గాయం అయినట్టుంది. త్వరగా ప్రథమ చికిత్సచేద్దాం. సంచీయేదీ?

పీ-టౌ: నా దగ్గరుంది.

(జే-హాయ్ దగ్గిరికి వెళ్లి మీదికి వంగి గాయానికి కట్టు కడతాడు)

వాంగ్: పీ-టౌ! జే-హాయ్‌కి తొందర తొందరగా కట్టుకట్టి ప్రథమచికిత్స కార్యాలయానికి తీసుకుపో.

పీ-టౌ: (వెళ్ళడానికి అట్టే ఇష్టంలేక) స్క్వాడ్ లీడర్! నేను...

వాంగ్: కామ్రేడ్స్! మీ చేతిబాంబులు, తుపాకులు సిద్ధంగా వుంచుకోండి. మెప్పులు పొందాలనే మనప్రతిజ్ఞ మరిచే పోకండి. ధైర్యంగా పోరాడండి. ఫస్ట్ సెక్షన్! రాండి. యిద్దరిద్దరు చొప్పున ముందుకు పదండి.

సూయ్: మందుగుండు సామాను వృధా చెయ్యకూడదనేమాట మరిచేపోకండేం.

[అంతా ముందుకు దూకుతారు. చేతిబాంబులు పేలిన ధ్వని, హీరాలాపాలు వినిపిస్తాయి. పీ-టౌ, జే-హాయ్ గాయానికి కట్టుకట్టడం పూర్తవుతుంది. దూరాన్నుంచి బాకా పిలుపు, తుపాకి గుళ్ళధ్వని, బిగ్గరగా ఏడ్పులు వినిపిస్తాయి. పి-టౌ, జే-హాయి మాట్లాడుకుంటుండగా ఎర్రసిపాయిలు ఇద్దరు ఇద్దరుచొప్పున స్టేజీమీదికి ఉరుకుతూంటూ వస్తారు.]

జే-హాయి: నన్ను కాసుకూచోట మెందుకు పి-టౌ! వెళ్లి శత్రువుల పనిపట్టించు.

పీ-టా: నిన్ను జాగర్తగా చూస్తూండమని స్క్వాడ్ లీడరు నాకాజ్ఞాపించాడు. జే-హాయ్! నిన్ను యుద్ధరంగం వెనక్కి తీసుకుపోతా. నయమవుతుందిలే. పగ తీర్చుకుంటాంగా!

జే-హాయ్: నాకోసరం నువు బాధపడకు పీ-టా!

పీ-టా: ఋష్! మాట్లాడకు.

జే-హాయ్: యిదిగో. పీ-టా! మావాళ్ళకి వుత్తరం రాసివుంచా. మనసేన మా పట్నం చేరుకున్నాక మావాళ్ళతో చెప్పు.

(ఉత్తరం పైకితీసి పీ-టాకి ఇస్తాడు)

పీ-టా: జే-హయ్! జే-హాయ్! యేవిటా పిచ్చిమాటలు!

(ఉత్తరం తీసుకుంటాడు)

జే-హాయ్: (చిన్ని కాగితపు పొట్లంతీసి)
పీ-టా! యిదిగో డబ్బు... నేను వెళ్ళిపోతున్నా... యిది రాజకీయం మాష్టారుకి యివ్వు. నేను పార్టీకి యివ్వవలసిందిది.

పీ-టా: (పొట్లంతీసుకుని) సరే. అధైర్యపడకు. నీగాయాలు మరేమంత ప్రమాదమయినవి కావులే.
(పీ-టా వంగి జే-హాయ్‌ని ఎత్తబోతూ అతనికేసి జాగ్రతగా చూస్తాడు)

పీ-టా: (ఏడుస్తూ) జే-హాయ్! జే-హాయ్! (చేతులు వదిలిపెట్టి మోకరిల్లి) జే-హాయ్! (జవాబులేదు. పీ-టా తల వంచుకుని కన్నీరు తుడుచుకుంటాడు. లేచి కాలితో

నేలమీదతన్ని బిగ్గరగా) జే-హాయ్! వెళ్ళి పగతీర్చు కుంటా! (జే-హాయ్ తుపాకి తీసుకుని ఉరుక్కుంటూ వెళ్లిపోతాడు)

× × × ×

[తొందర తొందరగా బాకాలు ఊదిన ధ్వనులు వినిపిస్తాయి. దీపాలు ఆరిపోతాయి. అర్ధచంద్రుడు క్రమంగా ఆకాశం దాటుతూంటాడు. అరుణోదయమవుతుంది. క్రమంగా దీపాలు వెలుగుతాయి. మొదట్లో ప్రజా సమూహం నీడలు మాత్రమే కనిపిస్తాయి. గందర గోళం, ఆవేశం పెల్లుబుకుతూంటాయి. ప్రజావిముక్తి సేనతాలూకు సిపాయిలు, రైతులు చిన్నచిన్న గుంపు లుగాచేరి మాట్లాడుకోవడం కనిపిస్తుంది. ఎర్రసిపాయిల చుట్టూచేరి ప్రజలు తాముపడ్డ కష్టాలు చెప్పుకుంటారు. ఈ రంగమంతటా నేపథ్యంలో సంభాషణ సాగుతూనే ఉంటుంది. కాని ఈకిందిమాటలు మాత్రం స్పష్టంగా వినిపిస్తాయి].

1వ వృద్ధు: సమయానికి మీరు వచ్చారుకాబట్టి సరిపోయింది గాని లేకపోతే నాగుడిసి కాలి బూడిదయి చక్కా-భ్బోయ్యేది. మా అదృష్టంకొద్దీ మీరు వచ్చి మంటలు ఆర్పేశారు.

2వ వృద్ధు: మీరేగనక కాసింతసేపు ఆలస్యం చేస్తే మేమంతా యీపాటికి చచ్చి స్వర్గాన్నుండే వాళ్ళం.

సాంగ్: అమ్మాయి! నువ్వు హుషారుగా వుండాలిసుమా. చూడు, వీళ్ళు-మనల్ని కాపాడిన వీళ్లు సాక్షాత్తు బుద్ధ

భగవానుని సేనకు చెందిన వాళ్ళే అనుకో. వీళ్ళు ఆపదలో వున్న వాళ్ళని కాపాడ్డానికి దిగివచ్చారు.

భార్య: (విచారంగా) అవును. కంటికి పండుగ్గావుంది. ఓ - వీళ్ళకోసరం యెదురు చూసీచూసీ కళ్ళు కాయలు కాచిపొయ్యాయ్!

1వ వృద్ధు: మీరు తొందరగా వస్తే బావుండునని యెంత యువ్వెళ్ళూరి పొయ్యా మనుకున్నారు!

యువకుడు: కామ్రేడ్స్! యివిగో మంచినీళ్లు. (ఇనప డేగిసా నించి అందరికీ మంచినీళ్లిస్తాడు)

1వ యోధుడు: బ్రదర్! థాంక్స్! యిక మాపని మేం చూసుకుంటాంలే. (కప్పుతీసుకొని నీళ్లుపోసుకుని తాగుతాడు)

2వ వృద్ధు: యెంత అదృష్టం చేసుకొన్నామో యింకా బతికున్నాం. మాబతుకు వృథాపోలేదు.

వృద్ధ వనిత: మనకష్టాలు తీరినయ్.

బిడ్డ: బాబాయ్! బాబాయ్! అమ్మని చంపేసారు.

2వ యోధుడు: బాబూ! యేడవకు. పగతీరుస్తాంలే.

భార్య: కుమింటాంగ్ సిపాయిలందర్నీ పట్టుకున్నారా? వాళ్లని తేలిగ్గా వదిలెయ్యకూడదు.

3వ యోధుడు: చావగా మిగిలిన వాళ్లందర్నీ ఖైదీలుగా పట్టుకున్నాం. మాస్క్వాడ్ వకటీ ముప్ఫయిమందిని పట్టుకుంది యింకా బోలెడంత మందున్నారు. యీ వళ్ళో వూళ్లోనేకాదు, సరిగ్గా యిక్కడ దాడిచేసినసమయానే

మూచూయాంగ్, షుయాంగ్-టీషౌల మీదకూడా
దాడిచేశాం. తయియుయాన్ పట్టుకున్నామా, యిక
మీరు కష్టాలతో, భయంతో వణికిపోనక్కర్లా.

భార్య: (అప్యాయంగా) కామ్రేడ్! నాకొడుకు మీ విముక్తి
సేనలో చేరాడు. మూడేళ్ళయింది. వాడు మొదటి
బ్రిగేడులో వున్నాడని విన్నా... ఆ బ్రిగేడుని చూశావు
గున్నావా? వాడిపేరు...

3వ యో: మొదటిబ్రిగేడా! వాళ్ళు పచ్చునదిన దాటి యెన్నడో
దక్షిణానికి వెళ్ళిపొయ్యారు. అయితేనేం నీకొడు
కేం పరవాలేదు. చూడు, నేను హానోపేనించివచ్చా.
కాని మీ పట్నంలో వున్నా. నీకొడుకు యెక్కడ
వున్నా బాగా పనిచేస్తూనే వుంటాడు.

భార్య: అవును. నాకు తెలుసు. తెలుసు, యిలాంటి రోజుల్లో
యింటిని అంటిపెట్టుకుని యేమగాడు కూర్చోగలుగు
తాడు! కుమింటాంగ్ సేనని పూర్తిగా నాశనం చేస్తేనే
గాని మనకి మంచిరోజులురావు.

[ఒక యువకుడు ఒక కుమింటాంగ్ సిపాయిని ఈడ్చు
కుంటూ వస్తాడు)

యువకుడు: కామ్రేడ్స్! యిదిగో యింకొకణ్ణి పట్టుకొచ్చా.
యీ కుక్కలకొడుకు మా ఆలూ దుంపలకొట్లో
దాక్కున్నాడు.

1వ వృద్ధు: (కు. సి. తో) యేం తలపొగరణిగిందా? ఊం
యిక నువ్మల్ని తిట్టి కొట్టు చూద్దాం. యింకా

మా కొంపలు తగలెడతావా? నేను...

[కొట్టడానికి ముందుకు వెళతాడు]

వాంగ్: (వారించి) తాతా! వాణ్ణి కొట్టబోకు. నీకు న్యాయం జరక్కూడదనికాదు. ఆఫీసర్లయినా సరే, సాదాసిపాయిలనా సరే లొంగిపోతేసరి విముక్తి సేన వాళ్లని వుదారంగా చూస్తుంది. వాళ్లూ మనలాగానే సామాన్యులు. బలవంతంమీద కుమింటాంగ్ సేనలో చేరారు. పగ తీర్చుకోవాలనుకుంటే, పెద్ద పెద్ద ప్రజా ద్రోహులు మీదా, స్థానికంగావున్న దుర్మార్గులమీదా పగతీర్చుకోవాలి. వెధవలు! వట్టి అభివృద్ధినిరోధకపు వెధవలు!

భార్య: ఏమయినా సరేగాని ఆస్ఫోటకం మచ్చల యాంగ్‌ని వాడి తండ్రినీ మాత్రం తప్పించుకు పోనియ్యకూడదు.

ప్రజ: (ఆవేశంతో) స్ఫోటకం మచ్చలయాంగ్‌ని తప్పించుకు పోనియ్యకండి. వాడు వట్టి రాక్షసపు ముండాకొడుకు! వాడెంతమందిని ఖూనీచేసాడో లెక్కలేదు.

2వ వృద్ధు: ఆ యాంగ్ నాచేతికి చిక్కితే యేమాత్రం దయ దలిచేదిలేదు.

వృద్ధవనిత: ఆ ముసిలి వెధవనికూడా వదలకండి. వాడి మూలంగా మాబతుకు నరకమయిపోయింది. నా కొడుకుని ఆ వెధవే పొట్టనబెట్టుకున్నాడు.

సాంగ్: కామ్రేడ్స్! యీ తండ్రీ కొడుకులిద్దరూ యీ చుట్టు పక్కల నెత్తురు వరదలు కట్టించారు. యెందర్నో [illegible] చేశారనుకున్నారూ! యెంత ఆస్తి ధ్వంసం [illegible]

లెక్కలేదు. వాళ్లని పట్టుకుని మాచేతుల్తో ముక్కలు ముక్కలుగా నరికిపారేసినా మాకసి తీరదు.

[ఒక యోధుడు కొంతమంది ఖైదీలని వెంటబెట్టుకుని ప్రవేశిస్తాడు.]

యువకుడు: (పరుగెత్తుకుని వెళ్లి ఖైదీలమధ్యనున్న యాంగ్ యూ-టేని యువతలకి లాక్కు వచ్చి) యిదుగో యాంగ్ యూ-టే! ముసిలిగాడిద! వీడే స్వోటకంమచ్చల యాంగ్ తండ్రి.

[ప్రజాసమూహం అతనిచుట్టూ చేరతారు. యోధులు వీళ్ళని దూరాన ఉంచేందుకు యత్నిస్తారు. యీ కింది మాటలు తప్ప యింకేవీ వినిపించవు.]

భార్య: (దెయ్యంపట్టిన దానిలాగా యాంగ్ వంక తేరిపారజూచి) యాంగ్ యూ-టే! యాంగ్ యూ-టే! (దగ్గరకి వెళ్ళాలని యత్నిస్తుంది. కాని సిపాయిలు నిరోధిస్తారు) వీడిమొహం చూడనీయండి! (వణుకుతూ దోవచేసు కొని వెళ్ళి నేలమీద కూలిపోతుంది) అబ్బ! (ఏడుస్తుంది).

సాంగ్: (ప్రార్థనాపూర్వకంగా) కామ్రేడ్స్! వకసారో, రెండు సార్లో కొట్టి వీడుపెట్టిన పాట్లకి కసితీర్చుకోనీండి.

1వ వృద్ధు: కామ్రేడ్స్! వీడిమూలకంగా యీ యిల్లాలు నరకం అనుభవించిందనుకోండి.

యువ: మాకు అడ్డంరాకండి. (యాంగ్ మీదికి ఉరికి కింద పడేస్తాడు) కాళ్ళు పట్టుకోరా పురుగా! ఊఁ—

భార్య: (ఏడుస్తూ) యెంత పుణ్యం చేసుకున్నానో యిది కళ్ళారా చూడటానికి బతికున్నా,

సాంగ్: వూరికే యేడుస్తూ కూచుంటే యేంలాభం? వెళ్లి రెండు తన్నిరా. ఊం—

వృ. వ: యింకా భయమెందుకమ్మా! మనకి అండదండగా విముక్తి సేన వుందిగా!

భార్య: (హఠాత్తుగా లేచి యాంగ్‌ని లాగి) యాంగ్ యూ—టే యిలా నాకేసిచూడు. గుర్తుపట్టలా? నా మొహంకేసి బాగాచూడు. (దయ్యంపట్టిన దానిలాగా) నువ్వంటే యిక నాకేం భయంలేదు. తెలిసిందా? (ఏడుస్తూ) యాంగ్ యూ—టే! యాంగ్ యూ—టే! మమ్మల్ని యెన్నియాతనలు పెట్టావురా!

సాంగ్: అమ్మాయి! వాణ్ణి ముందు రెండుతన్నవేం? ఊం— తన్ను.

భార్య: (ఏడుస్తూ) వీడిమొహంచూస్తే కసితో వళ్లు తెలీడం లేదు... వీణ్ణి నాచేతుల్తో చీల్చిపారేసినా నాకసితీరదు. (కొడతానికి చెయ్యి ఎత్తి మళ్ళీ దింపేస్తుంది.)
[పీ—టా బుజంమీద తుపాకి పెట్టుకుని మహా ఉత్సాహంతో ప్రవేశిస్తాడు]

పీ—టా: యిది యేకంపెనీ? ఖైదీలందర్నీ కువాంతి గుడికి తీసుకు పదండి. అక్కడే పెద్ద సమావేశం జరుగుతుంది. ఊం— తొందరగా పదండి.

[ఖైదీలని తీసుకుపోతారు]

పీ-టా: యేవి విడంతా? [ప్రజాసమూహంతో] నీకి మీద మీరంతట మీరు చెయ్యిచేసుకోకండి. ప్రజాకోర్టులకి అప్పగించండి.

[పీ-టా తల్లిచేతిని పట్టుకుంటాడు]

సాంగ్: (చూసి సంతోషంతో అరుస్తూ) యిడిగో పీ-టా! నువ్వు పీ-టావి కాదానాయనా? అమ్మాయి! యిదిగో క్షి-టా తిరిగొచ్చాడు.

భార్య: (ఒక విధమయిన మైకంతో చుట్టూ చూస్తూ) ఆ - బాబు! నా బాబు! యెక్కడున్నావు బాబు! యెక్కడున్నావు బాబు!

పీ-టా: (ఆశ్చర్యంతో) అమ్మా! సాంగ్ అమ్మమ్మా!

సాంగ్: చూడమ్మా! చూడు. యిడిగో నీ బాబు! (ఆనంద బాష్పాలు తుడుచుకుంటుంది)

ప్రజ: (సంతోషంతో, దయతో) పీ-టా! తిరిగొచ్చావా? అదిగో మీ అమ్మ! అడుగో చావ్ పిన్ని కొడుకు!

భార్య: (నిజం గ్రహించి క్షి-టాని దగ్గరికి తీసుకొని ఏడుస్తూ బాబూ! బాబూ! వచ్చావా? యేలాగయితేనేం మంచి రోజులు వచ్చాయి. నువ్వూ తిరిగొచ్చావ్....

పీ-టా: (కన్నీళ్లు పెట్టుకుని) అమ్మా! (మాటలు పెగలలేదు. చిరునవ్వు తెచ్చుకుని) అమ్మా! (యింకా గొంతులో ఏదో అడ్డుపడుతూ) అమ్మా! యేడవకమ్మా! యిది సంతోషించాల్సిన సమయం. చూడమ్మా! నేనూ,

బాబుని. విముక్తి సేనలో నాకెంతమంది స్నేహితులు న్నారో చూడు. లక్షమందిని మనశత్రువుని చెండాడ డానికి వచ్చారమ్మా! ఆ సోపటకంమచ్చల యాంగ్ యేడి?

వెనకనించి ఒకగొంతు: యమధర్మరాజు కొలువులో చేరడానికి వెళ్ళాడు!

ప్రజ: అరె! చచ్చిపోయ్యాడా! వాణ్ణెందుకు చావనిచ్చారు?

భార్య: విముక్తి సేన యాంవోని యమలోకానికి పంపించింది బాబూ! నీకామ్రేడ్స్‌కి నాకృతజ్ఞత తెలపవూ?

1వ వృద్ధు: మంచివాళ్ళకి యేనాటికైనా శుభం కలిగితీరుతుంది.

2వ వృద్ధు: నీకొడుకు యెంతవాడయ్యాడమ్మా! వాడు విముక్తి సేనలో చేరడం మంచిదేఅయింది. లేకపోతే యిలాంటి అదృష్టం మనకి పట్టేదా?

భార్య: బాబూ! సాంగ్ పిన్ని నాకుచేసిన వుపకారానికి కృత గ్నత తెలపనేలేదు!

పీ-టా: అవునవును. సాంగ్ అమ్మమ్మా...

సాంగ్: అబ్బే! అలా యేడుస్తారా యెక్కడయినా! మన మంతా యివాళ మహా సంతోషంగా గడపాలి. విముక్తి సేన మా అందరిప్రాణాలూ రక్షించింది. నా కొంప నిలబెట్టింది. యెంత సంతోషించాల్సిన రోజు! యిక మీాయిద్దరూ యింటికెళ్ళి హాయిగా వుండండి.

పీ-టా: ఉహుం- నాకింకా పనుంది. అమ్మా! నేవెళ్ళి మా బటాలియన్ కమాండరుని, రాజకీయం మాస్టార్ని

కలుసుకోవాలి. సెలవు అడక్కుండా రావడం యెలా? సైనిక నిబంధనలని వుల్లంగించడం కాదూ? విముక్తి సేనలో వాళ్ళమంతా క్రమశిక్షణకు కట్టుబడి వుంటాం. బలే! అదుగో మా కమాండరుగారూ, రాజకీయం మాస్టారూ యిలాగే వస్తున్నారు.

[చావో, చౌ మాట్లాడుకోవడంలో నిమగ్నులయి ప్రవేశిస్తారు. సిపాయిలు సల్యూట్ చేస్తారు.]

చావో: (మాటల్లో నిమగ్నుడయినా తిరిగి సల్యూట్ చేస్తూ) యీవైపున శత్రురక్షణ దుర్గాలు బలీయంగా వున్నాయి. యింకా తూర్పున దాడి ప్రారంభిస్తే బావుండిపోయ్యేది...హుం—

చౌ: షీ–టా! యేం సంతోషమయిందా? నీక్కావల్సిన మనిషి దొరికాడా?

షీ–టా: ఓ– దొరికాడు. కాని అందరూ దొరకలా. జే–హాయ్ చావుకి పగతీర్చుకోడానికి శత్రుసిపాయిలమీద దూకు దామనుంది.

చౌ: (విచారంతో) జే–హాయ్ మంచి కమ్యూనిస్టు! అతన్ని గ్యాపకం వుంచుకుని అతని అడుగుజాడల్లో నడుచు కోవాలి.

చావో: విప్లవంలో త్యాగాలు తప్పవు. జే–హాయ్ మరణం వృధా కాలేదు. అతని మరణం మహోత్కృష్టమయింది.

షీ-టౌ: అమ్మా! నీరు మా రాజకీయం మాస్తాను, నీరు మా బటాలియన్ కమాండరు చావో... యీావిడ మా అమ్మ.

[చావో, అతని భార్య ఒకరివంక ఒకరు తేరిపార జూచుకుంటారు. ఇద్దరిహృదయాలూ కరిగిపోతాయి]

షీ-టౌ: యేమిటమ్మా, యిది?

భార్య: బాబూ! మీా కమాండరుగారి పేరుకూడా చావో కదూ?

షీ-టౌ: అవునమ్మా!

చావో: అవును...నువ్వు హెయి-టాన్ తల్లివి కదూ?

భార్య: ఆఁ-మీారా? మీారా? నిజంగా మీారే? తిరిగొచ్చారా?

[షీ-టౌ ఏమీా అర్థంగాక తల్లివంకా, చావో వంకా చూస్తాడు. చౌ, షుయాంగ్ మెర్ తదితరులు, ప్రజలు ఆశ్చర్యపోతారు]

చౌ: చావో! యేమిటిదంతా? మాకేం అర్థంకావడంలేదు.

సాంగ్: యేమమ్మా! యీాయనేనా షీ-టౌ తండ్రి?

షీ-టౌ: మా నాన్నా?

చావో: (ఆవేగంతో) యీా ప్రాంతాలకి మీారెలా వచ్చారు? నేను యింట్లోంచి వెళ్ళిపోయి పదమూాడేళ్ళయినా మిమ్మల్ని మరిచేపోలేదు. మనకుజరిగిన అన్యాయాలూ మర్చిపోలేదు...మీాకు నేనేమీా చెయ్యలేకపోయ్యాను. ఉహుఁ- నిజానికి... యెలా చెప్పను... అద్భుతం! అద్భుతం! యీా పదమూాడేళ్లూ యెలాగడిపారు?

భార్య: బాబు మీతో చెప్పలా?

భావో: (పీ-టా కేసి తిరిగి) పీ-టా! ఓ- నువ్వు హెయిటాన్ వా? నా కొడుకునా?

భార్య: యిందుకు నీకోసరం నెతక్కూపాసనని పేరు మార్చే శాను... బాబూ! నీకే మీనాన్న!

పీ-టా: (నాతాత్తుగా అర్థంచేసుకుని) ఓ-అదా కథ!
[ప్రజాసమూహానికి ఆసక్తి ఎక్కువవుతుంది. గుస గుసలు, సంభాషణలు సాగుతాయి]

భావో: నా! యీమె ... యింక చెప్పనక్కర్లేదనుకుంటా. (భార్యతో) యీయన నా మాస్టారు. బాబు బహు మంచివాడు. నిజానికి వీడికి సనదు యిప్పిద్దామను కుంటున్నా. కాని ప్రస్తుతపరిస్థితులలో... యీవిషయం యితర్లు చర్చించాల్సివుంటుంది.

నా: ప్రస్తుత పరిస్థితుల్లో...పీ-టా! యికనించి నువ్వు కమాం డరుగారి ఆజ్ఞలను బాగా పాటించాలిసుమా!

(పీ-టా సిగ్గుతో మందహాసం చేస్తాడు)

నా: అవును. సరిగా ఆలోచిస్తే పీ-టా అనేక విషయాల్లో నీ పోలికే. సింహమంతటి ధైర్యం. యిక మొండితనా నికి...అవును. గ్నాపకం వచ్చింది. (పీ-టాతో అధి కార స్వరంతో) పీ-టా! మీనాన్న కనిపించాడు, మీఅమ్మ కనిపించింది. యికపిచ్చిపిచ్చి వేషాలువేస్తే మాత్రం వూరుకునేది లేదు. తెలిసిందా?

1వ వృద్ధు: యిదంతా కట్టుకథకంటె కూడా చిత్ర విచిత్రంగా వుంది. వియత్ సేన మూలకంగా కాకపోతే యీ కుటుంబం మళ్ళీ కలుసుకునేదా! మన మంతా యీ మృగాలకి ఆహారమయిపొయ్యేవాళ్లం.

భార్య: యీ కష్టకాలంలో సాంగ్ పిన్ని మాకెంతో సహాయం జేసింది. యీవిడ ఆదుకోకపోతే మేం మలమలమాడి చచ్చిపోయుండేవాళ్ళం.

చావో: (సాంగ్ తో) అత్తయ్యా! నీ రుణం యెలా తీర్చుకో గలం? యింకా విజయాలు సాధిస్తా. యింకా మెప్పు పొందుతా. మన ప్రజలంతా శాంతి భద్రతలతో జీవించడానికి శత్రుశేషం లేకుండా తుడిచిపెట్టేస్తా. యీ విధంగా నీ రుణం తీర్చుకుంటా.

సాంగ్: అబ్బే! అదేవిటి? మేమే మీ రుణం తీర్చుకోలేం. మీరు మాకు చేసిన మహోపకారం కలకాలం మరిచిపోం.

చావో: (భార్యతో) బాబుకి నిజంగా పందొమ్మిదేళ్ళు న్నాయా? పద్దెనిమిదేళ్ళే అనుకున్నా. మతిమరుపు!

భార్య: మతిమరుపేంకాదు. నిజానికి పద్దెనిమిదేళ్ళే.

చావో: బాబు మాదగ్గరికి వచ్చిన్రోజున యెన్నేళ్లు నీకని అడిగా. పంధొమ్మిదని చెప్పాడు. నిజమే ననుకున్నా.

పీ-టా: సేనలో చేరిన మరుసటియేడు యింకోయేడు యెక్కువ చెప్పుకున్నా. లేకపోతే యింటికిపంపించేస్తారని భయం వేసింది.

**(S17)**

చావో: పగదీర్చుకోడానికి బాబు యెంతపనయినా చెయ్యగలడు. (భార్యతో) యాంగ్‌యూ-షే యింకా యీ వూళ్ళోనే వున్నాడా? పగదీర్చుకోడానికి వెళదామనుకుంటున్నా.

భార్య: యాంగా? మీ వెనక యెవరున్నారో చూడండి.
(ప్రజా సమూహమంతా వెనక్కి తిరిగి యాంగ్ కేసి చూస్తారు)

2వ వృద్ధు: బటాలియన్ కమాండర్! వీళ్ళని కాసంతయినా దయదలచగూడదు. యీభూమ్మీద వీళ్లు చెయ్యని దుర్మార్గాలంటూ లేవనుకోండి. మానభంగాలేనా, దొంగతనాలేనా, గృహదహనాలేనా, హత్యలేనా వకటేమిటి! యీచుట్టుపక్కలవాళ్ళందర్నీ పాదాలకింద చీమల్ని నలిపినట్టు నలిపేశారు. దుర్మార్గులు!

భార్య: (యాంగ్‌తో) యాంగ్ యూ-షే! యాంగ్‌యూ-షే! యిదీ కళ్లు తెరచి యిలా చూడు. (చావోని చూపుతూ) యీయనెవరు? గుర్తొచ్చిందా?
(యాంగ్ తెల్ల మొహం వేసి భయకంపితుడయిపోతాడు)

చావో: యాంగ్ యూ-షే! యాంగ్‌యూ-షే! గుర్తొచ్చిందా? (కోపంతో) వెధవా! వూరపందిలా బలిసావ్! యెందుకొచ్చిన బతుకురా! పదమూడేళ్ళయింది! యింకా నేను పగతీర్చుకోలేదు. చా! నిజంగా...
(యాంగుని కొట్టడానికి హఠాత్తుగా చెయ్యెత్తి మళ్ళీ తమాయించుకుని నాలుగడుగులు పక్కకి వేస్తాడు.)

ప్రజ: నీణ్ణి రాళ్ళతో కొట్టిచంపండి! కీళ్ళు వూడగొట్టండి! యెంతమందినో పొట్టపెట్టుకున్నాడు! వీణ్ణి చంపినా పాపంలేదు! చిత్రవధ చెయ్యండి!
(ఇలా అంటూ యాంగ్ మీద చెయ్యిచేసుకోడానికి చుట్టూ ముడతారు. చౌ వారిని ఆపి)

చౌ: కామ్రేడ్స్! మీరు చాలా మంచివాళ్ళు. మనంతొందర పడడం మంచిదికాదు. యీ ముసిలిగాడిద పనిపట్టి ద్దురుగాని. వీడి సంగతి నాకు తెలుసు. వీడు వట్టిరాక్షసి వెధవ! ప్రజాద్రోహి! యిప్పటికీ వీడికి పశ్చాత్తాపం కలగలేదు. ఆయుధాలు దించలేదు. కాని మనసేన యెవరినయినాసరే ఖైదీగా పట్టుకుంటే మనంతటమనమే వారిజోలికి పోవడానికి హక్కులేదు. మన ప్రభుత్వానికి అప్పగించాలి. మన ప్రభుత్వంవారు యీ చుట్టుపక్కల వున్నవారందర్నీ పిలిపించి విచారణచేస్తారు. ప్రజాకోర్టు వీడికి తగినశిక్ష విధిస్తుంది. మిమ్మల్ని వీడుపెట్టిన కష్టాలు మీ కోర్టులో చెప్పుకుందురుగాని.

ప్రజ: సరే. సరే.
అలాగే కానీండి.
అదే సరయిన పద్ధతి.

చౌ: హర్రా-రా!

షుయాంగ్: యేమండి మాష్టారూ?

చౌ: యీ యాంగ్‌ని రెజిమెంటు ప్రధాన కార్యాలయానికి తీసికెళ్ళి వీడు యీ ప్రాంతంలోకల్లా మహాదుర్మార్గు

డనీ, స్పెషల్ యేజంటనీ చెప్పు. జాగర్తగా విణ్ణి కనిపెట్టుకుని వుండమను ఆత్మహత్యచేసుకుని చచ్చి పోకుండాచూడమను. వీడికి ఆత్మహత్య చేసుకునిచచ్చే యోగ్యతకూడా లేదు.

(షుయాంగ్, యాంగ్ కేసి తుపాకి గురిపెట్టి కూడా తీసుకుపోతాడు. రెజిమెంటు హార్కారా వస్తాడు.)

హార్కారా: సాబ్! రెజిమెంటలు ప్రధాన కార్యాలయంనించి ఆజ్ఞలు.

(చావోకి కాగితం ఇస్తాడు. చావో వెంటనే చదువు కుంటాడు)

పీ-టా: (చావో కాగితం చదువుతూండగా) మాస్టారూ! (చిన్న పొట్లంతీసి) జే-హోయ్‌పార్టీకి యివ్వాల్సిన సొమ్మిది. చచ్చిపొయ్యేముందు మీకిమ్మని చెప్పియిచ్చాడు.

చౌ: (తీసుకుంటూ) జే-హోయ్ బటాలియన్ కమాండరుతో రెండేళ్లున్నాడు. పీ-టా! అతను చేసేపని నువుచేస్తూండు.

పీ-టా: (తటపటాయిస్తూ) మాస్టారూ... నేననుకుంటా ... నాకు అర్హతవుందా చెప్పండి?....

(చావో కాగితం చౌకి ఇస్తాడు)

హార్కారా: జవాబు యివ్వరా! (సల్యూట్ చేసి వెళతాడు)

చావో: (గడియారం చూసుకుని కుడివైపుకు వ్రేలుగెత్తి) వాంగ్ లీ-ఫా! బాకా వినిపించగానే అన్నికంపెనీల వాళ్ళూ వూరికి వుత్తరాన సమావేశం కావాలని చెప్పు. (సంతృప్తితో చౌతో) పోరాటానికి తయారుకండి.

1వ వృద్ధు: యిదంతా కట్టుకథకంటెకూడా చిత్ర విచిత్రంగా వుంది. విముక్తి సేన మూలకంగా కాకపోతే యీ కుటుంబం మళ్ళీ కలుసుకునేదా! మన మంతా యీ మృగాలకి ఆహారమయిపొయ్యేవాళ్లం.

భార్య: యీ కష్టకాలంలో సాంగ్‌పిన్ని మా కెంతో సహాయం జేసింది. యీావిడ ఆదుకోకపోతే మేం మలమలమాడి చచ్చిపోయుండేవాళ్ళం.

చావో: (సాంగ్‌తో) అత్తయ్యా! నీ రుణం యెలా తీర్చుకో గలం? యింకా విజయాలు సాధిస్తా. యింకా మెప్పు పొందుతా. మన ప్రజలంతా శాంతి భద్రతలతో జీవించడానికి శత్రుశేషం లేకుండా తుడిచిపెట్టేస్తా. యీ విధంగా నీ రుణం తీర్చుకుంటా.

సాంగ్: అబ్బే! అదేవిటి? మేమే మీ రుణం తీర్చుకోలేం. మీరు మాకు చేసిన మహోపకారం కలకాలం మరిచేబోం.

చావో: (భార్యతో) బాబుకి నిజంగా పందొమ్మిదేళ్ళు న్నాయా? పద్దెనిమిదేళ్ళే అనుకున్నా. మతిమరుపు!

భార్య: మతిమరుపేంకాదు. నిజానికి పద్దెనిమిదేళ్ళే.

చావో: బాబు మాదగ్గరికి వచ్చిన్రోజున యెన్నేళ్లు నీకని అడిగా. పంధొమ్మిదని చెప్పాడు. నిజమే ననుకున్నా.

పీ-టా: సేనలో చేరిన మరుసటియేడు యింకోయేడు యెక్కువ చెప్పనున్నా. లేకపోతే యింటికిపంపిం చేస్తారని భయం వేసింది.

(S17)

చావో: పగదీర్చుకోడానికి బాబు యెంతపనయినా చెయ్య గలడు. (భార్యతో) యాంగ్‌యూ-ఛే యింకా యీ వూళ్ళోనేవున్నాడా? పగదీర్చుకోడానికి వెళదామను కుంటున్నా.

భార్య: యాంగా? మీ వెనక యెవరున్నారో చూడండి.
(ప్రజా సమూహమంతా వెనక్కితిరిగి యాంగ్ కేసి చూస్తారు)

2వ వృద్ధు: బటాలియన్ కమాండర్! వీళ్ళని కాసంతయినా దయదలచగూడదు. యీభూమ్మీద వీళ్లు చెయ్యని దుర్మార్గాలంటూ లేవనుకోండి. మానభంగాలేనా, దొంగతనాలేనా, గృహదహనాలేనా, హత్యలేనా వకటేమిటి! యీచుట్టుపక్కలవాళ్ళందర్నీ పాదాలకింద చీమల్ని నలిపినట్టు నలిపేశారు. దుర్మార్గులు!

భార్య: (యాంగ్‌తో) యాంగ్ యూ-ఛే! యాంగ్‌యూ-ఛే! యదీ కళ్లుతెరచియిలాచూడు. (చావోని చూపుతూ) యీాయనెవరు? గుర్తొచ్చిందా?
(యాంగ్ తెల్లమొహంవేసి భయకంపితుడయిపోతాడు)

చావో: యాంగ్ యూ-ఛే! యాంగ్‌యూ-ఛే! గుర్తొచ్చిందా? (కోపంతో) వెధవా! వూరపందిలా బలిసావ్! యెందు కొచ్చిన బతుకురా! పదమూడేళ్ళయింది! యింకా నేను పగతీర్చుకోలేదు. చా! నిజంగా...
(యాంగుని కొట్టడానికి హఠాత్తుగా చెయ్యెత్తి మళ్ళీ తమాయించుకుని నాలుగడుగులు పక్కకి వేస్తాడు.)

ప్రజ: వీణ్ణి రాళ్ళతో కొట్టిచంపండి! కీళ్ళు వూడగొట్టండి! యెంతమందినో పొట్టపెట్టుకున్నాడు! వీణ్ణి చంపినా పాపంలేదు! చిత్రవధ చెయ్యండి!

(ఇలా అంటూ యాంగ్ మీద చెయ్యిచేసుకోడానికి చుట్టూముడతారు. చౌ వారిని ఆపి)

చౌ: కామ్రేడ్స్! మీరు చాలా మంచివాళ్ళు. మనంతొందర పడడం మంచిదికాదు. యీ ముసిలిగాడిద పనిపట్టి ద్దుముగాని. వీడి సంగతి నాకు తెలుసు. వీడు వట్టిరాక్షసి వెధవ! ప్రజాద్రోహి! యిప్పటికీ వీడికి పశ్చాత్తాపం కలగలేదు. ఆయుధాలు దించలేదు. కాని మనసేన యెవరినయినాసరే ఖైదీగా పట్టుకుంటే మనంతటమనమే వారిజోలికి పోవడానికి హక్కులేదు. మన ప్రభుత్వానికి అప్పగించాలి. మన ప్రభుత్వంవారు యీ చుట్టుపక్కల వున్నవారందర్నీ పిలిపించి విచారణచేస్తారు. ప్రజాకోర్టు వీడికి తగినశిక్ష విధిస్తుంది. మిమ్మల్ని వీడుపెట్టిన కష్టాలు మీ కోర్టులో చెప్పుకుందురుగాని.

ప్రజ: సరే. సరే.

అలాగే కానీండి.

అదే సరయిన పద్ధతి.

చౌ: హర్కారా!

షుయాంగ్: యేమండి మాష్టారూ?

చౌ: యీ యాంగ్‌ని రెజిమెంటు ప్రధాన కార్యాలయానికి తీసికెళ్ళి వీడు యీ ప్రాంతంలోకల్లా మహాదుర్మార్గు

డనీ, స్పెషల్ యేజంటనీ చెప్పు. జాగర్తగా వీణ్ణి కనిపెట్టుకుని వుండమను. ఆత్మహత్య చేసుకుని చచ్చి పోకుండా చూడమను. వీడికి ఆత్మహత్య చేసుకుని చచ్చే యోగ్యతకూడా లేదు.

(షుయాంగ్, యాంగ్ కేసి తుపాకి గురిపెట్టి కూడా తీసుకుపోతాడు. రెజిమెంటు హార్కారా వస్తాడు.)

హార్కారా: సార్! రెజిమెంటలు ప్రధాన కార్యాలయంనించి ఆజ్ఞలు.

(చావోకి కాగితం ఇస్తాడు. చావో వెంటనే చదువు కుంటాడు)

పీ-టా: (చావో కాగితం చదువుతూండగా) మాస్టారూ! (చిన్న పొట్లంతీసి) జే-హాయ్‌పార్టీకి యివ్వాల్సిన సొమ్మిది. చచ్చిపొయ్యేముందు మీకిమ్మని చెప్పియిచ్చాడు.

చా: (తీసుకుంటూ) జే-హాయ్ బటాలియన్ కమాండరుతో రెండేళ్లున్నాడు. పీ-టా! అతను చేసేపని నువుచేస్తూండు.

పీ-టా: (తటపటాయిస్తూ) మాస్టారూ... నేననుకుంటూ .... నాకు అర్హతవుందా చెప్పండి?....

(చావో కాగితం చౌకి ఇస్తాడు)

హార్కారా: జవాబు యివ్వరా! (సల్యూట్ చేసి వెళతాడు)

చావో: (గడియారం చూసుకుని కుడివైపుకు ఎలుగెత్తి) వాంగ్ లీ-ఫా! బాకా వినిపించగానే అన్నికంపెనీల వాళ్ళూ వూరికి వుత్తరాన సమావేశం కావాలని చెప్పు. (సంతృప్తితో చౌతో) పోరాటానికి తయారుకండి.

యివాళ మనం చిచియాంగ్ గ్రామం చేరుకోవాలి. బహుశా మళ్ళీ దాడికి కొత్త ఆజ్ఞలు జారీకావచ్చు.
[చావో వెనుదిరిగి ప్రేమతో భార్యకేసి చూస్తూ ఆమె దగ్గరికి మెల్లిగా నడుస్తూ వెళతాడు. మాటలు పెగలడంలేదు. అతని భార్యకూడా అతనికేసి ప్రేమతో చూస్తుంది. పీ-టా తల్లిదగ్గిరికి చేరుకుంటాడు. తల్లి అతనిని కావలించుకుంటుంది.)

పీ-టా: అమ్మా! తిరిగొచ్చింతరవాత నిన్ను కలుసుకుంటాం... అమ్మా! అలా బాధపడకమ్మా! శత్రువుల్ని పూర్తిగా తుడిచిపెట్టేస్తేనేగాని మనం గుండెలమీద చెయ్యేసు కొని నిద్రపోలేం. నీకు తెలీందేంవుంది! మేమంతా కలసి పోరాడాల్సి వుంది. చూడమ్మా! యీ కామ్రేడ్సు మన శత్రువుకు నాశనం చెయ్యడంలో తోడ్పడ్డారా, మనమూ అలాగే వాళ్ళకి తోడ్పడాలి. యాంగ్సీనదికి దక్షిణాన ప్రజలు యింకా విముక్తి పొందలేదు... జే-హాయ్‌ని చంపినందుకు నేనింకా కసితీర్చుకోలేదు...

భార్య: బాబూ!

చావో: (భార్యతో) యిది విప్లవం! శత్రువుల్ని పూర్తిగా తుడిచిపెట్టేవరకు నేనుపోరాడీతీరాలి. తప్పదు...నువ్వు నాకోసరం పదమూడేళ్లు యెదురుచూసావ్. నేనింకా ఆయుధాలు కిందపెట్టలేదు... యిపుడు నాచేతిలో తుపాకీవుంది. అదృష్టం! వెనక, ఆ ముదనష్టపురోజుల్లో నాన్న కోర్టుల్లో దెబ్బలాడుతున్నరోజుల్లో మనలాంటి దరిద్రులికి చేతిలో ఆయుధాల్లేవు. అదీ వచ్చినచిక్కు...

యిక యిపుడో, ప్రజలచేతుల్లో ఆయుధాలున్నాయి. ఇపుడే వాటిని మూలసారేయలేం... సాంగ్ అత్తయ్యా! యీమెని యింకా నాలుగురోజులపాటు ఆదుకో. ని వుపకారం మా సేన యెన్నటికీ మరిచేబోదు.

సాంగ్: మీరు ప్రజలందరికోసరం పాటుపడుతూ వుపకారం! వుపకారం అంటారేవిటి? (భార్యతో) షీ-టౌ, వాళ్ళ నాన్న సరయినపనే చేస్తున్నారమ్మా!

భార్య: (సాంగ్‌తో ఆవేగంతో) అవును. నాకు తెలుసు. సరయినపనే చేస్తున్నారు... కాని నా మనసు... (నిట్టూర్చి) పదమూడేళ్ళు, పిన్న!

షీ-టౌ: అమ్మా!

భార్య: (కన్నీళ్ళు ఆపుకుని, గిరున మొహం తిప్పేసుకుంటుంది) సరే, తండ్రీ కొడుకులిద్దరూ వెళ్ళండి. మీకు నేనేం అడ్డంరాను. మీరు నా కళ్ళముందుంటే నా మనసు కుదటపడుతుంది. మంచిరోజులు రాబోతున్నాయి ... సరే. వెళ్ళి బాగా పోరాడండి. ఆ కుమింటాంగ్ పటాలాన్ని తుడిచి పెట్టేసెయ్యండి. వకట-పురుగునీ మిగల్చకండి.

చౌ: అక్కా! యుద్ధం అయిపోయినాక నీ కోసరం మనిషిని పంపుతాం. వచ్చి బటాలియన్ అంతా చూద్దువుగాని. చాలారోజులుండి కమాండరుతో హాయిగా గడుపు దువుగానిలే. మీకుటుంబం తిరిగి కలుసుకుంద్దిగదూ.

వుత్సవం చేస్తాం. ఆవుత్సవానికి నేను సారాకొంటా చూడు.

ప్రజ: బటాలియన్ కమాండర్! ఆ మెగారి విషయం మీరేం బెంగెట్టుకోకండి. యీావూళ్ళో వాళ్లం ఆమెగార్ని జాగర్తగా చూస్తుంటాం.

చౌ: కామ్రేడ్స్! యింకేం ఆమెని మీకు వప్పగించి వెళుతున్నాం.

చావో: హూర్కా-రా!

సీ-టా: (చురుకుగా) ఆఁ- కమాండర్!

చావో: వేళయిందని బాకావాళ్లతో చెప్పు.

సీ-టా: సరే, కమాండర్! (సల్యూట్ చేసి వెళతాడు)

[బాకాధ్వని వినిపిస్తుంది. చావో, చౌ కుడివైపుకి నడుస్తారు. ప్రజలు వారివెంట నడుస్తూ ఉత్సాహం కలిగిస్తారు. "జనతా సేనావాహిని జయపతాక ధారులం." అనే పాట ప్రారంభమవుతుంది.]

[ తెర ]

ఆ ఖ రు